ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్

రిజిస్టర్డ్ కార్యాలయం
3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర.)

ఇతర కార్యాలయాలు
కామాని మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038
17 చిత్తరంజన్ అవెన్యూ, కలకత్తా 700 072
160 అన్నాసలాయి, మద్రాసు 600 002
1/24 ఆసఫ్ ఆలీ రోడ్డు, కొత్తఢిల్లీ 110 002
80/1 మహాత్మాగాంధీ రోడ్డు, బెంగుళూరు 560 001
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029
బిర్లా మందిర్ రోడ్డు, పాట్నా 800 004
పాటియాలా హౌజ్, 16-ఎ, అశోక్ మార్గ్, లక్నో 226 001
ఎస్.సి. గోస్వామి రోడ్డు, పాన్ బజార్, గౌహతి 781 001



**ISBN 0 86125 944 0**

ప్రచురణ
ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

టైప్ సెట్
మాస్టర్ గ్రాఫిక్స్, లక్డీకాపూల్, హైదరాబాద్ 500 004.

ముద్రణ
స్పీడ్ ప్రింట్, సైదాబాద్, హైద్రాబాద్ 500 004

# రెండు మాటలు

శ్రీ కృష్ణశాస్త్రి వంటి ఆరియుతేరిన (రచనా) వృద్ధ మూర్తుల రచనా సంపుటాలకు ముందు ఏవో రెండు మాటలు వ్రాయబోవడం చాపల్యంవల్ల గాని, చాతుర్యంవల్ల గాదు. అయితే ఈ ప్రయత్నం ఎందుకు? అంటే – ఆయన రచనల మీద ఉండే తెగ ఇష్టం వల్ల, అని జవాబు.

ఒకసారి శ్రీ కృష్ణరాయభాషానిలయంలో జరిగిన మహాసభకు హాజరయి, శ్రీ శాస్త్రిగారి కారులో తిరిగివస్తూ ఆయనతో అన్నాను. – "అన్నగారూ, మీ రచనలన్నీ – రేడియో నాటికలు – ప్రసంగాలతో సహా త్వరగా అచ్చయి ఎప్పుడు వస్తాయా అని ఎదురుచూస్తున్నాం. మిమ్మల్ని 'కృష్ణపక్షం', 'ఊర్వశీప్రవాసం'– కవిగానే లోకం చాలా వరకు ఎరుగును. మీ అద్భుతమైన వివిధసారస్వత ప్రక్రియలను ఒడుపైన వచనరచనలను లోకానికి చూపి చకితం చెయ్యాలి" అని ఊరుకోక, 'పోనీ కొన్నిరచనలు నాకివ్వండి – నేను చక్కగా వేస్తాను.' అన్నాను.

శాస్త్రిగారు స్తిమితంగా – 'అన్నీ సిద్ధం చేశాను. త్వరగానే అచ్చవుతాయి. చూడండి' అన్నారు.

అని, సుమారు మూడేళ్ళయింది.

పుస్తకాలు అచ్చుకాలేదు.

అయితే – శాస్త్రిగారి కాలమానంలో మూడేళ్ళంటే మూడు రోజులన్నమాట.

తర్వాత మళ్ళా కలుసుకోలేదు. తదుపరి చాలా మార్పులు వచ్చాయి.

శాస్త్రిగారు దైవికంగా మౌని అయిపోవడం, ఆయన ఆరోగ్యం ఎన్నాళ్ళకోగాని కుదురుపడకపోవడం వగైరా–

మొన్న ఆ మధ్య కలుసుకున్నప్పుడు ఆయన బల్లమీద "బహుకాలదర్శనం" అనే రచనల సంపుటి హఠాత్తుగా కనపడేటప్పటికి, నా సంతోషానికి మేర లేకపోయింది.

ఆయన ఆ సంపుటానికి ఏ ఇతర కారణాలవల్ల ఆ పేరు పెట్టినా, వాటికోసం ఎదురుచూచే అస్మదాదులయెడల ఆ పేరు అన్వర్థం అయింది.

"బహుకాల దర్శనం" లో – ఒక ఆప్తత ఉంది. ఆపేక్ష ఉంది. ఆశ ఉంది.

బహుకాలానికి అయిన ఆ "దర్శనం" మళ్ళా అదృశ్యం కాకుండా మా విశ్వోదయ ధృఢసంకల్పంతో శాస్త్రిగారి రచనా సంపుటాలను పరంపరగా ప్రకటించడానికి పూనుకోవడం, ఏనాడో అస్మదాదుల కళ్ళల్లో మెదలిన స్వప్నానికి సుస్థిరరూపం ఇవ్వడమై, మరింత ఉల్లాసాన్ని కలిగిస్తున్నది.

ఇక్కడ ఒక ప్రశ్న —

ఏమి ? —

శాస్త్రిగారి పుస్తకాల ప్రచురణకు ఎందుకంత తహతహ ?

తెలుగుదేశం, రచయితలకు, కవులకు, గొడ్డు పోయిందా?

చేయివిసిరితే, వందమంది.!

పుస్తకాలకు కరువా?

విపణివీధిలో వేలకువేలు.

మరి ? —

అక్కడే ఉంది విశేషం. ఈ ప్రశ్నకు సరైన జవాబుచెబితే- శాస్త్రిగారి రచనాసారాన్ని స్పృశించినట్టే !

శాస్త్రిగారికీ, ఆంధ్రలోకానికీ ఉండే అనుబంధం విచిత్రమైనది.

మొదట శాస్త్రిగారికి లోకం ఎంత ఇష్టమో, అంత అందకుండా దూరంగా ఉండేవారు.

లోకానికి లోపల ఆయన మీద ఎంత అనురాగమో అంత విముఖంగా ఉన్నట్టు కనబడేది. క్రమంగా రెండు దశాబ్దులు కడచేటప్పటికి శాస్త్రిగారు తమ లోకాతీత కవితా గంధర్వలోకంనుంచి ప్రజల్లోకి తొంగిచూడడం ప్రారంభించారు. జనత తలయెత్తి ఆయనవైపు ఆశగా చూచింది. లోకంలోని ఎత్తులూ, పల్లాలు, విసుగులు, విలాసాలు,

వలపులు, వగవులు, అందాలు, అహంకారాలు, ఆయన్ను ఎలుగెత్తి పిలిచాయి.

అన్నింటికీ ఆయన మారుపలికారు. ఆ పలుకులో నుంచి సూటిగా సూనృతంగా గేయాలు పరుగులెత్తాయి. ప్రసంగాలు పరిమళించాయి. యక్షగానాలు ప్రత్యక్షమైనాయి. విజ్ఞానం వినోదం సహస్రముఖాల విచ్చుకున్నాయి.

వీటిని ప్రజలకు అందించడానికి అభ్రభారతి (Radio) చేసిన సహాయం మరువరానిది.

ఇట్టి విశిష్టరచయిత రచనలను ఏకముఖంగా చేతిలో పెట్టుకుని చదివి ఆనందించకుండా సాహిత్యప్రియులు ఉపేక్ష వహించలేరు. అంతేకాదు –

ఆ రచనల సంస్కారం అనన్యాదృశమైనది. లోకంలోని కొందరు రచయితలు పురాణవిశ్వాసాలకో, నవీన వ్యామోహాలకో తాకట్టుపడి ఒకటి పురస్కరించడం వేరొకటి తిరస్కరించడం పరిపాటి.

శాస్త్రిగారు ప్రాచీన నవీన ప్రగతి వాదాల త్రివేణీ సంగమం. ఇందులో ఏ ఒక్కటీ నిర్గుణమైనదిగాని, నిర్దుష్టమైనది గాని కాదని ఆయన తలంపు. ప్రతిభావంతుడు అన్నిటినీ చూస్తాడు. తనమార్గమేదో తాను నిశ్చయించుకుంటాడు. ఒకరి వెంటపడడం, ఒకరికి ప్రతిధ్వనిగా మారడం అతనికి కిట్టని సంగతి. ఈ సత్యాన్నే కాళిదాసు మాళవికలో అన్నాడు – "సంతః పరీక్ష్య అన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః"

చిన్ననాడు మహాకవులు పండితులు అయిన తండ్రి పెదతండ్రుల సాహచర్యం,

విద్యార్థిదశలో ఆంగ్లభాషా సాహిత్య కోవిదుడు రఘుపతి – నాయుడుగారి ఆచార్యకం, బాగా ఎదిగినపిమ్మట రామమోహనరాయల వంటి మానవతావాదుల అపార ప్రభావం, ఆయనను క్రొత్తవ్యక్తిని చేశాయి. కనుకనే ఆయన సాహిత్యంగురించి మాట్లాడినా, సామ్యవాదం గురించి మాట్లాడినా ఉమర్ ఖయ్యాము గూర్చి మాట్లాడినా, ఉపనిషత్తులు గూర్చి మాట్లాడినా, ఒక విలక్షణ వాక్కు ఖంగున మ్రోగుతుంది.

ఒకకొందరికి వలె ఆయన రచనకు లోకంలో అస్పృశ్యము లంటూ ఏవీ లేవు, 'శక్తి అంటూ ఉండాలిగాని, రచయితకు ఉదారం, నీచం అనీ, రమ్యం జుగుప్సిత మనీ, ఏదీ లేదు. అన్నీ ప్రతిభాపించికతో స్పృశిస్తే మనోహరం అయిపోతాయి.' అని ఆయన మతమూ, అనుభవమూను.

కనుకనే ఆయన 'పుష్పలావికలు' గురించి ఎంత శ్రద్ధగా చెప్పగలరో, 'బూట్ పాలిష్' గురించికూడా అంత ఇంపుగాను చెప్పగలరు. శ్రీనాథుని కవితారహస్యాలలోకి చొచ్చుకుపోయి చూచినట్టే, చిన్నారిపాపల ఆటలపాటల్లో కూడా లీనమై పోగలరు. కాబట్టి, ఆయన నోటివెంట ఏది వచ్చినా ఎవరో ప్రేరణచేస్తే వచ్చినట్టుకాక, హృదయంనుంచి దూసుకు వచ్చినట్టు కనపడుతుంది.

ఇంకో విశేష మేమంటే,

కొందరు రచయితలు ఏదో ఒక రచనాప్రక్రియను అవలంబించి, కృతార్థు లవుతారు. మరికొందరు కొన్నిటిని అభిమానించి, మరికొన్నిటిని ప్రయోగాత్మకంగా వ్రాస్తారు. అవి సఫలం కావచ్చు. విఫలం కావచ్చు. నమ్మకం లేదు.

శాస్త్రిగారి విషయంలో మొదట అట్లాగే అనుకున్నాం; ఆయన దుర్గం కవిత మాత్రమే అనీ, ఇంకేదీ ఆయన వల్లకాదనీ, కాని – ఆయన కవితను మించిన వచనమూ, యక్షగానాలూ, నాటికలూ వ్రాసి, లోకాన్ని దిగ్భ్రాంతం చేశారు. కథ, నవల జోలికి పోలేదు. ఆయన రుచే వాటి మీదకు ప్రసరించ లేదేమో.

ఉత్తమ రచయితకు ప్రతిభ, వ్యుత్పత్తి సమృద్ధిగా ఉండాలంటారు. కాని, శాస్త్రిగారికి వ్యుత్పత్తికంటె ప్రతిభమీదనే పక్షపాతం. అట్లా అని – ఆయన వ్యుత్పత్తిని తిరస్కరించిన సన్నివేశాలు చెప్పదగినంతగా కనపడవు. లోకంలో లబ్ధప్రతిష్ఠులైన కవుల కంటె ఆయన వాడిన అపశబ్దాలు తక్కువే.

ఏతావాతా ——

ఆధునికాంధ్ర సాహిత్యంలో అసాధారణ ప్రతిభావంతుడైన రచయిత శ్రీ కృష్ణశాస్త్రి. అట్టివారి రచనలు లోకానికి త్వరగా సమగ్రంగా

అందాలి. ఆ ప్రయత్నంలో సంకీర్ణ వ్యాసాలు, సాహిత్య ప్రసంగాలు, యక్షగానాలు, శ్రవ్య నాటికలు, గేయాలు, ఖండ కావ్యాలు, క్రమంగా ప్రకటితం కావడం ఆంధ్ర సాహిత్యప్రియులకు ఎంతైనా హర్షదాయకమనుకుంటాను. ఈ విశ్వోదయ ప్రయత్నానికి ప్రజామోదం ఉంటుందని నా విశ్వాసం.

కావలికళాశాల
1-10-65

ఇట్లు
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

నా ప్రాణబంధువులు

శ్రీ యస్. యన్. మూర్తికీ

అంటే

సూరి నారాయణమూర్తికీ

సౌభాగ్యవతి మహాలక్ష్మమ్మకూ

ఈ "పుష్పలావికలు"

(మూర్తిగారూ, 1938 నుంచి కాబోలు, మీరు నాచేత ఎన్ని పాటలూ నాటికలూ వ్యాసాలూ వ్రాయించారో! 'పుష్పలావికలు' మీరు కోరితే రచించినదే! జ్ఞాపకం ఉందా?)

# కృష్ణశాస్త్రి కృతులు

పుష్పలావికలు
కోవెల – కొలను
సువాసనద్రవ్యాలు
మా ఊరు పోయింది
మా ఊళ్ళో వీథి అరుగు
శ్రీ కృష్ణావతారతత్వము
గుహుడు
మలుపు తిరిగితే

# పుష్పలావికలు

చిన్నవరకు అనిపిస్తుంది ఆరోజులే బాగుండేవేమిటి చెప్మా అని! అప్పుడు పదునాలుగు లోకాలకూ రాకపోకలుండేవి. అడపా తడపా అప్సరసలు నేలమీదకు దిగివచ్చేవారు. అప్పుడప్పుడు నాగకన్యలూ వచ్చేవారు. నదులూ గిరులూ పెళ్ళి చేసుకునేవి. లతలూ తరులూ వలచుకునేవి. అన్నిటికీ మనిషితో దగ్గర చెలిమి ఉండేది. పలకరింపులూ ప్రణయాలూ, పట్టింపులూ, అన్నీ, మనుష్యులకూ వాటికీ ఉండేవి.

ఇప్పుడు మనిషికీ మనిషికే అంత స్నేహం లేదు.

ఇవన్నీ ఎందుకు? మీరు ఏ మనుకోండి, ఒకందుకేనా పాతరోజులు బాగుంటాయి నాకు. అప్పుడు పుష్పలావికలు ఉండేవారు.

ఇప్పుడు లేరా అంటే, ఉన్నారూ, లేరూ కూడా. అప్పటి లాంటివారు మాత్రం లేరు.

ఎవరు చెప్పారు మగవాడిని పూవు అమ్మమని? ముసలి వాళ్ళనీని!

పుష్పలావికలు "ప్రాయంపు పూవుబోండ్లు." అసలు వాళ్ళే, వాళ్ళసోయగమే, రకరకాల అలరుల కూడలి.

అదీగాక, వాళ్ళకు "కందువమాటలు" వచ్చును. "నర్మగర్భోక్తులు." ఇందుకు సాక్షులు, మన పూర్వకవులందరూను. ముఖ్యంగా పింగళి సూరన్న, చేమకూర వెంకన్న వంటివాళ్ళు.

ఇంకో సంగతి. పూవు లమ్మడం అంత తక్కువ పని కాదప్పుడు. చాలా ఉదాత్తమైనది. పువ్వులమ్మే అంగళ్లలో పుల్లలమ్మే గతి పట్టిందని ఊరికే అనలేదు మనవాళ్లు.

ఎవరెవరో ఎక్కడెక్కడికో వెళ్లి ఏవేవో పూవులు ఏరో, తుంపో తెచ్చి, ఎల్లా గెల్లాగో దండలో గుత్తులో ఏర్పరచి, మన మొగాన పారవేయడం గాదు, పువ్వులమ్మడం అంటే.

అబ్బో ! అది బ్రహ్మాండమైన కళ ! చెట్టుకొమ్మపైన పుట్టించడం మొదలుకొని, సిగపాయలో కట్టించడం దాకా, వివిధ దశలలో, విరులమ్మే వెలదుల విద్య మనకు కనపడేదప్పుడు.

వివరంగా చెప్తా ఎల్లాగో.

ఏ చెట్టును, ఏ తీగను, ఎలాగ త్వరగా పూవులు తొడిగించాలి ? అ వెప్పుడు ఎలాగ ఎవరు కొయ్యాలి ? అవి వాడకుండా ఎలాగ ఉంచాలి? ఎవ్వరి కేవి విలవాలి ? ఏ విరుల వాసన లెంత కాలము నిలవాలి ? ఇదంతా తెలియాలి అప్పటి పుష్పలావికలకు.

అప్పుడు పూల వాడకం ఎక్కువగా ఉండేది, భామినుల అలంకరణాలు మొదలుకొని భగవదర్చన వరకూ.

మరి పూలుకూడా నాడు ఎక్కువ రకాలు ఉండేవేమో.

కోవిదార మంటే ఏదో ! కొండగోగు ఎలాగుంటుందో గాని ! కొండగోగు కర్ణికారమైతే మదనదేవుడు దాని మొగ్గనే కాబోలు, తన చిగురు గొడుగుపైన గుబ్బగా పెట్టుకొనేవాడు ! దేవకాంచన మెలా గుంటుంది చెప్మా ! దిరిసెనయేనా శిరీషం ? శేఫాలిక అంటే నల్లవావిలట; దాన్ని చూడనేలేదు. కలిగొట్టుపూల వాసనలు మోసుకొస్తాయట వేసవి వేకువగాలులు. ఇప్పుడు నరమామిడిని అశోకం అంటారు; అల్లా అనడం నాకు బాగుండదు. తప్పుకూడా అనిపిస్తుంది.

ఇదంతా ఎందుకంటే, అప్పుడెన్ని రకాల పూవులుండేవని ! కొనుగోలును బట్టి సరకు సమకూర్చడముంటుంది. అమ్మేవాళ్లనుబట్టి అమ్మకము కూడా ఉంటుంది.

కేల లీలాకమలం, అలకల్లో బాలకుందం, చూడాపాశంలో నవకురువకం, కర్ణావతంసంగా శిరీషం, సీమంతంలో నీపం, ఆనన సీమపైన లోధ్రప్రసవపరాగం - అమ్మయ్యో, ఒక్కొక్కరికి ఎన్ని పువ్వులు కావలసి వచ్చేవి అప్పటి విలాసవతులకు !

మరి, అంగనల అలంకరణాలకేనా ఈ అలరులు ! కలవారి పాన్పులపైన దుప్పటులయ్యేవి కుసుమాలు. కల్యాణ మండపాలయ్యేవి. కంకణాలయ్యేవి. పాలవెల్లులయ్యేవి. కోవెలలో స్వామికి సర్వమూ అయ్యేవి.

తప్పకుండా అప్పుడు పూలవాడక మెక్కువ. కాని వాడడం తక్కువేమో, అంటే వాడిపోవడం. కనుక అప్పుడు పుష్పలావికలకు తీరిక తక్కువ, గౌరవ మెక్కువ.

ఇంకో విశేషం. అప్పుడు, చెట్లపైన తీగలపైన ప్రసవాలూ, పల్లవాలూ కలిగించడం కూడా పుష్పలావికల పనే అనుకుంటాను.

వాళ్లకు కాలాల, ఋతువుల హద్దులు లేవు. వాళ్లకు ఎరువు లక్కరలేదు. అమరనందనంలోనూ, అలకాపురారామంలోనూ ఆరు కాలాలూ ఒక్కసారే ఏ తీరున అవతరించి ఉండేవో, శిప్రానదీ తీరాన ఉజ్జయినీ పరిసరాన ఉద్యానవనాలలో గూడా అంతేనేమో !

యక్షమందిరము సంగతి మనకు తెలియదుకాని, కాళిదాసు వీడు ఉజ్జయినీ ప్రభువు ప్రాసాదానకు ఉత్తరాన ఉండి ఉంటుంది. ఆ యింటి వాకిలి గుమ్మం ఇంద్రధనస్సులాగ దూరాన్నుంచి కనపడి ఉంటుంది. ఆ పక్కనే చేతి కందే పూలగుత్తులతో అతని భార్య పెంచిన బాలమందారముండి ఉంటుంది. ఆ వంకన ఒకబావి, ఆ కెలకున క్రీడాశైలం, ఆ చెంత బంగారపు టరటులూ ఉండి ఉంటాయి. అక్కడొక మాధవీ లతామంటపం, చుట్టూ గోరంటల ప్రాచీరమూ పజ్జనే అల్లాడే ఆకులతో రక్తాశోకమున్నూ. సుందరవకుళమున్నూ. అవీ, కవి భార్యా, కవిరాక కోసం నిట్టూరుస్తూ ఎదురుచూస్తూ ఉండేవి.

ఎందుకూ ?

ఆమె ఎడమకాలితో తన్నితేగాని అశోకము పుష్పించేది కాదు. ఆమె వదనమదిర పుక్కిటితో పైన చల్లితేనే కాని పొగడ పూచేదే కాదు.

ఆ రోజు లెల్లాంటివో ! చెట్లకూ చేమలకూ కూడా ఏమి కోరిక లండీ అప్పుడు ! ఎంత తెలుసునండీ !

వాటకే అభ్యంతరమూ లేదు పువ్వు లివ్వడానికి; అయితే చచ్చు ఎరువులు వేస్తే పిచ్చి విరులు ఇస్తాయి. అందుకే నేననుకుంటూ అప్పటి పుష్పలావికలకు తరుల తాదుల తలపులు తెలుసునని! "పూలబాసలు తెలుసు యెంకికి" అన్నట్లు.

అందుకనే, వాళ్లే తోటలు వేసి, వాళ్లే మొక్కలు నాటి, వాళ్లే నీరు పోసి పెంచేవాళ్లు గారాముగా. అందువల్లనే తోట గుమ్మం దగ్గర పుంతబాటపై పడి వచ్చే వాళ్ల అడుగుల సడి ఆలకించగానే పులకించేవి, తలలూపి రమ్మనేవి చెట్లు.

ఇంక పువ్వుకూ పుష్పలావికకూ ఏమి నెయ్యాలు ! ఎన్ని రకాల నెయ్యాలు !

ప్రేంకణము ఆమె ముట్టుకుంటేనే పుష్పించేది. ఆమె పుక్కిటితో మదిర పైన ఉమిస్తేనే గాని పొగడ లొంగేది కాదు. ఆమె వామపాదం తగలాలి; అప్పుడు అశోకం కుసుమించాలి. తిలకం అంటే ఎర్రగోరింట, ఆమె చూపు ప్రసరిస్తేనే విరిసేది, వెర్రిది ! కురవకం పరవసించి ప్రసవాలు తొడగడానికి ఆమె ఆలింగనందాకా అవసరమయ్యేది. చెవిలో ఆమె మందమధురంగా ప్రియోక్తులూదితే మందారం నిలువునా సుందరపుష్పాలే. పాపం, ఒక్కసారి తనవైపు మందహాసం చేస్తే చాలు అమాయకపు సంపెంగ పూచేది. మావిచెట్టు పూయడానికి ఆమె నిట్టూర్పుపైన సోకాలి. కొన్ని చెట్లకు రాచకీవులున్నూ, గొప్ప అభిరుచులున్నూ ! సురపొన్న సుమించడానికి సుఖంగా సంగీతం ~~పాడి~~ వినిపించాలామె. కర్ణికారం అలరులతో కలకల లాడడానికి ఎదురుగా నృత్యం చేసి చూపించాలి.

మాళవికా, యక్షుని భార్యా, కవి ప్రేయసీ, వీరు మాత్రమే గాక పుష్పలావికలు కూడా తప్పకుండా ఈ పనులన్నీ చేసే వారని నాకు నమ్మాలని ఉంది. ఒక సామంతునికి పచ్చని అశోక ప్రసవాలు కావాలనుకోండి ! అవి ఇల్లాలి ధమ్మిల్లములో ముడవాలనుకోండి.

పుష్పలావిక అది ముందే తెలుసుకునేది.

తక్షణం ఏం జేసేదీ ?

కాళ్లకు కడియాలూ, అందెలూ పెట్టుకునేది. పాదాలకు లత్తుక కూడా పూసుకునేది. తాను పెంచిన తోటలో "తపనీయాశోకము" దగ్గరకు వెళ్లి కాస్త తాకేది ఎడమ పాదంతో ! తక్షణం అది పూచేది. వాటిని తెచ్చి ఆ సామంతునకు విలిచేది పుష్పలావిక.

ఇల్లాగే ఎవరికి కావలసిన పూవులు వారికి.

ఈ పూష్పలావికలు కొందరు పొద్దుట పుష్పాపచయం చేసేవారు; కొందరు సాయంకాలం కోసేవారు కుసుమాలను అవసరాన్ని బట్టి.

అర్చనకైతే ఉదయమే కొయ్యా లేమో ! సరస కార్యాలకైతే సాయంకాలం.

ఎటొచ్చీ కుసుమ లావికలే కోయాలి కుసుమాలను. మోటుచేతులు కావు !

ఓహో ! మన కావ్యాలు పుష్పాపచయాన్ని ఎల్లాగ వర్ణించేసేయి. పద్మాన్ని కోయడానికి చేయి జాపితే, దానికీ తామరతూడుకీ తేడా తెలియగూడదు. ఎర్రగోరంటలు కోస్తుంటే అవి మరీ ఎర్రనైపోవాలి అరచేతి వన్నెలతో. నల్లకలువల వైపు కోయడానికి అల్లన వంగి చూస్తుంటే, అవీ చూపులూ వియ్య మందాలి, "నింగిపై ప్రేలెనే నీలాల పేరు" అన్నట్లు.

ఇల్లాగ వనంలో పడి, పుష్పలావికలు పువ్వులు కోస్తూంటే, దూరాననుంచి చూసేవారి చూపులకు ఆ విలాసవతులు ఆనేవారు కారు.

ఎలాగ ఆనతారు ! కన్నులు కలువలై, పెదవులు మంకెనలై, పాణులు పద్మాలై, నవ్వులు మల్లెలై, ఎలుగులు కోయెలలై, తాము

తీవలలో తీవలై, కొమ్మలలో కొమ్మలైతే ఎలాగ అనతారు.

అయితే, పాపం! ఈ పుష్పలావికలకు ఒక్కొక్కప్పుడు ఇబ్బందులుకూడా వచ్చేవి – చివురు లనుకొని అరచేతులను కోయిలలు కరవబోయినప్పుడూ, దొండపండనుకొని చిలకలు పెదవులను కొరకపోయేటప్పుడున్నూ. మనం ఎరిగున్నంత వరకు అబలలైన అందగత్తెలను అమితంగా బాధపెట్టినవి, ఆ రోజుల్లో తుమ్మెదలు.

అందుకే పుష్పలావికలపైన పూర్వకవులకు మహజాలీ ఇష్టమున్నూ. కాళిదాసుకు మరిన్నీ, యక్షుని చేత అనిపించలేదూ అతను మేఘం ద్వారా ప్రియురాలికి సందేశము పంపినపుడు! ఏమని?

"ఒయ్యోయి, మేఘుడా ! నువ్వు తోవలో నీచైర్గిరి మీద కాస్త సేద దీర్చుకొని మళ్లీ బయలుదేరి పోతుంటే వనాలు వస్తాయి. ఆ అడవుల్లో ఏళ్లుంటాయి గదా ! వాటి గట్లమీద తోటల్లో అడవి మొల్లమొగ్గలు కనపడతాయి. వాటిని నీ నీటి చినుకులతో తడుపుతుంటే, అక్కడ పుష్పలావికలు కనబడతారు. పాపం, వాళ్లలసి ఉంటారయ్యా! పాపం, వాళ్ల చెక్కిళ్ల మీద చెమట పడుతుంది. దానిని పదే పదే తుడుచుకోవడం వల్ల వాళ్ల చెవులకు జూకాలలాగ ఉన్న కలువలు వాడిపోతాయి. చూడు, మేఘుడా ! వాళ్లమీద కాస్త నీడ పరచు అయితే అక్కడ ఆగిపోకు వాళ్ల సోయగం చూస్తూ. నీకు అక్కడ మరికొంత సేపుండాలని ఉంటుంది, నాకు తెలుసు. అయితే నా పని తొందర అల్లాంటిది. ఒక్క క్షణంలో బయలుదేరు."

ఈ మాటలవల్ల తేలేది ఏమిటి? కుసుమలావికలే కోరి కోరి తోటలలో వేరు వేరు రకాల చెట్లను వేసుకునే వారనిన్నీ, చేరి చేరి తామే పెంచుకునే వారనిన్నీ, గారాంగా నొవ్వకుండా తామే పువ్వులను కోసుకునే వారనిన్నీ.

అంతేగాక వాళ్ళు కిసలయాలంత మిసిమిగా, కుసుమాలంత కోమలంగా ఉండే లావణ్యవతు లనిన్నీ స్పష్టం.

ఇక మన తెనుగు కావ్యాలు చూస్తే, పుష్పలావికలకు కలికితనాన్ని మించిన చురుకుతనం ఉన్నట్టు కూడా మనకు తెలుస్తుంది.

ఉండక పోతే ఎల్లాగ?

సాధారణంగా వీళ్ళు అంగళ్ళలోనే పువ్వు లమ్మేవాళ్లు. కొందరు మరీ సామంతుల మందిరాలకు తామే వెళ్ళి అమ్మేవారేమో!

ఉదయం మాత్రము అంగళ్ళు పెట్టేవారని నాకు తోచదు. పొద్దుటి విరులు కొద్దిమందికే.

సందెవేళ సందర్శించాలి విరి అంగడుల వీధి.

మునిమాపు చీకట్లింకా ముసరలేదు. ముసిరినా, వెన్నెల దివ్వెల్లాంటి వన్నెలాడు లున్నారు కదా – పుష్ప లావికలు! ఇక ఆ తెరువునకు. సరసులకు దారి చూపించే చోపుదారు మలయానిలం. రెక్కలమీద పరిమళాల బరువు మోసుకుంటూ నడుస్తున్నాడు ముందు.

అంతంత దూరం నుంచి విరివిపణికలకలం! చిరుగంటల మోతల వంటి విరివెలదుల నవ్వుల రవళులతో కలసిపోయి, దూరమేఘ గర్జనవంటి విటరాయల సరసుల కంఠరవాలు వినబడతాయి. ఇంతలో పువ్వుల అంగడి తెరువు ప్రవేశిస్తాము. ఎంత పెద్ద తెరువు! ఎన్ని అంగళ్లు! అక్కడ అపరసంధ్యాకాశఖండం అవనికి జారినట్టు. ఇక్కడ ఇంద్ర ధనుస్సులు విరిగిపడ్డట్టూ! అక్కడ రకరకాల అంచుల రంగురంగుల పావడాల, జిలుగు వన్నెల వసనాల పల్లెవాటుల అచ్చరలు మంజరులై, మాలికలై సమావేశమై నట్టు!

ఓహో! ఏ అంగడికి వెళ్ళడం! ఏ పూవు లేరుకోడం! సరసుని మనస్సు చెదరిపోతుంది. చెదరక? వాసనలు పిలిచే వన్నెలు పిలిచే – పుష్పలావికల కన్నులు పిలిచే, కలికి నవ్వులు పిలిచే!

అయితే వలసిన్న పూలున్నాయి, తెలిసిన అంగడి ఉంది. అక్కడికి పోతాడు సరసుడు. ఇహ అక్కడి బేరసారాలు–అంటే "కందువ మాటలు" పరియాచకాలు, వినండి. "వెలదీ, ఈ నీ దండ వెల ఎంత?" అంటే, "నా దండ కెవరు వెల పెట్టగలరు?" అని జవాబు. ఇద్దరూ నవ్వుతారు. " ఈ పోక పూవు పొత్తి చిదిమినపాపం నీ మెడను

చుట్టుకొంటుందిలే" అంటే, "నీ మెడ పోకపువ్వుపాత్తిలా" గుందని అయ్యగారి సూచన! "ఈ చివుళ్ళను గిల్లిన పాపం నీ పాదాలను పట్టి పెనగుతుందిలే," "ఈ పద్మాలను తుంపిన పాతకము నీ మొహంమీదే కనపడుతుందిలే" అని వారంటే, "ఓ అల్లాగా" అని ఒయ్యారంగా వీరు మూతి విరవడం, "పాటలాలూ, మల్లెలూ, కలువలూ కావా" లని వారంటే "ఇవిగో" అని పెదవులు విరచి, నవ్వి, కళ్లింత చేసి వీరు చూడడం- "ఈ కలువలు ఇంత వికసించాయి ఎందువల్ల" నని వారంటే "రాజు వస్తే అల్లాగే వికసిస్తాయి" అని వీరు అనడం, ఇల్లాగ చిరునవ్వులూ, సిగ్గులూ, చిడిముడిపాట్లూ, చేతుల్ని తగిలించుకోవడాలూ, కళ్లల్లో కళ్లు కలుపుకోవడాలూ, మూతులు విరుచుకోవడాలూ, ఒక పట్టున పువ్వులు అమ్మడమూ కొనడమూ తేలదు.

"తొలకెడు హోసకాంతుల వి
        ధుద్యుతి(బ్రోచి చకోరమైత్రి జో
కలు మెరయించు కన్గవల
        కల్కితనంబున బుష్పలావికల్
తలపులు గొల్లలాడి మి
        గులన్ భ్రమయించి యువవ్రజంబుచే
వెల లధికంబుగా గొనుచు
        వేడుక నమ్మిరి పువ్వు లంగడిన్."
"ప్రాయపు గాయకుల్ వెలనె
        పాన నెగాదిగ జూడ 'నేర్పు లో
రా యివి! దండమీద గొస
        రం దొరకొంటిరి! మంచిసాములే
పో! యటులైనచో సరస
        ముల్ గద మీ కిపు' డంచు నవ్వురిన్
గాయజు తూపు లమ్ముదురు
        కందువమాటల బుష్పలావికల్!"

# కోవెల – కొలను

అటు చామర్లకోటనుంచీ, ఇటు కాకినాడనుంచీ, అటు పిఠాపురం నుంచీకూడా శ్రీ భావనారాయణస్వామి వారి దేవాలయ గోపుర శిఖరం కనపడుతుంది.

పైన ఆకాశం నీలం. కింద ఆమ్రవనాలు ఆకుపచ్చన. నడుమ ఆ మావి తోపులలో నుంచి పైకి శిరస్సెత్తి నిలబడ్డ గోపురం నలుపు!

ఆ గోపురాన్ని స్పష్టంగా పట్టుకుందుకు, నిలిచి నిలిచీ, చూపులు గుచ్చి గుచ్చీ, చూడాలి.

ఆ గోపురం ప్రత్యక్షమైనంతనే దూరదూరాలనుంచి ప్రపన్నులూ, తైర్థికులూ శిరస్సులు వంచుకుని అంజలులు నిటలాలపై కీలిస్తారు.

భావనారాయణ ప్రభువు సర్పవరంలో వెలిశారు.

సర్పవరం చిన్నగ్రామం.

ఆ పల్లెకు నాలుగువైపులా మామిడితోపులూ జీడిమామిడి తోటలూ, నడుమ నడుమ పచ్చని చేలూను. తోటకూ తోటకూ మధ్య చేనుకూ చేనుకూ నడుమ, ఇసుకదారులు మలుపులు మలుపులు తిరిగి, మాయ మవుతుంటాయి. గోపురం మీద నుంచి చూస్తే ఆ పుంతతోవలు గోధుమత్రాచు పాముల్లాగ కనబడతాయి.

సర్వవరంలో ఒకపెద్ద తెరువు ఉన్నది. అది ఊరి బయట నుంచి బయలుదేరి, దేవళం ముఖద్వారంసోపానాల వద్ద ఆగి, ఊరుకుంటుంది, తనపని కాస్తా అయిపోయినట్టు. ఆ వీధి నడుమ ఒక చిన్న మండప మున్నట్టు జ్ఞాపకం.

కోవెలకు ఉత్తరాన గోపురం ఉన్నది.

గోపురానకు ఆవలివైపున కోనేరు ఉన్నది.

కోనేరు కావలి కెలన పొలాలూ, తోపులూ ఉన్నాయి. కోనేటిలో కలువలూ, తామరలూ ఉన్నాయి. నాచు ఉన్నది. కోనేటిలో తామరాకు గొడుగుల కిందికిచేరి అప్పుడప్పుడు బాతులు ధ్యానంలో మునిగిపోతాయి. అప్పుడప్పుడు తామరతూళ్ల నడుమా, నాచునడుమా, నిలబడి ఒక్కొక్క తెల్లకొంగ జపం చేస్తుంది. దానిని చూచినవారు పొరపాటున కమలకోరకమో, కలువమొగ్గో అనుకుంటారు.

కోవెలకోనేటిలో కమలమూ కలువా కూడా నిశ్చలంగా జపం చేస్తూనే ఉంటాయి.

దేవళములో గంట గణగణా మోగినప్పుడు, పుంతదారులలో తలలూపుతూపోయే ఆలమందలు అట్టే ఆగి, ఒక్కసారి తలలెత్తి, తిరిగి మెల్లగా కదులుతాయి.

పొలాలలో, పొలాల గట్లపై, కర్షకులూ, కాపరులూ ఒకసారి శిరస్సు లోరగావంచి, ఘంటాధ్వని విని, ఆశాబలాలు తెచ్చుకున్నట్టు, కార్యకలాపాలకు తిరిగి ఉపక్రమిస్తారు.

కోనేటిలో గలగల లాడుతూ పొరలే చిరుకెరటాలు కూడా ఒక్కసారి ఆగి, ఊపిరి బిగబట్టివిని, మరీ కరిగి పోతాయి.

ఆ సమయాన కోవెలగంట పిలుపూ, ఆలఅంభా రవమూ, దవ్వులనుంచి ఒక్కొక్క మానవకంఠస్వరమూ, ఒక్కొక్క పక్షికూతా, రెక్కల రెపరెపా, తరగల గలగలా ఈధ్వను లన్నీ కలిసి పల్లెలో ప్రతి యింటా వినబడి, మరీ నిశ్చలనిశ్శబ్దంతో గ్రామవాతావరణాన్ని నింపినట్టు అనిపిస్తుంది.

గోపురం గంభీరంగా గోచరిస్తుంది, గ్రామానికి యజమానిలాగ! పల్లీయులనందరనూ రేబవళ్లు కనిపెడుతూ కాపాడుతున్న తండ్రిలాగ సాక్షాత్కరిస్తుంది. గోపురం మహా గర్వంగా ఉంటుంది. గోపురాన్ని చూసి గ్రామవాసులూ గర్వపడతారు.

గోపురం తండ్రి అయితే, కోనేరు తల్లి. చల్లని నీటి అలలతో మాలిన్యం కడుగుతుంది. తీయని పానీయంతో దాహం చల్లార్చుతుంది. స్వచ్ఛగంభీరమైన హృదయం ఉంటుంది కోనేటికి. మృదులవిశాలమైన ఊయెలవంటి అంకమూ ఉంటుంది కోనేటికి.

గోపురం కోనేటివైపు రవంత ఒరిగినట్లుంటుంది. అప్పుడప్పుడు దాని నీడ కోనేటిలో పడుతుంది.

అయితే నిజానికి ఆ గ్రామవాసుల తల్లీ తండ్రీ దేవళంలో వేంచేసి ఉన్నారు, ఇంటింటా వేంచేసి ఉన్నారు. ప్రత్యంత రంగంలో వెలసి ఉన్నారు.

ఇలాగ, మన తెలుగునాట కోవెలలేని పల్లె లేదు. గ్రామాన్ని కాపాడడానికి మాత్రమే కోవెల వెలయలేదు. కోవెలలేనిదే పల్లీజీవితానికి చల్లదనం లేదు. గ్రామ శోభకు వన్నెలేదు కూడాను.

కొండ కోనలోనో, మలుపు ఆనుకునో, పొలాల ఒడిలోనో, తోటలతెరలవెనకాలనో, నదీతటాననో, కాలువ ఒడ్డుననో ఉంటుంది తెనుగుపల్లె. తెనుగుపల్లెకే ఒక తీయని చల్లని చక్కదనం ఉన్నది.

ఏటి ఒడ్డున శయించేటి పల్లియ, కొండ
ఘాటీల నిద్రపోయేటి పల్లియ, మావి
తోటదుప్పటి తొంగి చూచు పల్లియ, పైరు
చేల పానుపున పల్లియ! -

ఆపల్లె వెలుపలనో, నడుమనో ఒక దేవళం, దానికి ఒక చిన్న గోపురమో, శిఖరమో. దాని పక్కనే కోవెల తోట. ఆ తోటలో వన్నెవన్నెల వాసనల గన్నేరులూ నంది వర్ధనాలూ పొగడలూ

పారిజాతాలూ మల్లెలూ మందారాలును! ఆ కోవెలకు మరొక పక్కన అర్చకుని ఇల్లూ. తొలి ప్రొద్దులా మలుసందెలా అర్చనలూ, ఘంటానాదాలూ, కోవెల తలుపులకు వెలాడు చిరుగంటలమోతలూ, మంత్రపాఠాలూ స్తోత్రపాఠాలూ, చందనమూ నీరాజనమూ తులసి నీరూ వీటి పరిమళములన్నీ కలిసిన దివ్యపరిమళమూ. దేవాలయా వరణములో వేదికలమీద ప్రశాంతంగా కూర్చున్న గ్రామవాసులూ. రాత్రివేళల చిరుప్రమిదలలో దీపాలవీ కాగడాలవీ కాంతులూ, అప్పుడప్పుడూ ఉత్సవాలూ పర్వదినాలూ కల్యాణాలూ స్వామి ఊరేగింపులూ తీర్థాలూనూ. వీటిలో ప్రతివస్తువూ గ్రామస్థుని ప్రతిదిన జీవితానికి బలమూ, పటిమా, ఊరటా, ఉత్సాహమూ, చల్లదనమూ, ఆవేశమూ ఇస్తూనే ఉన్నది.

అటుపొలంలో నాగటిమీద ఒకచేయూని, రెండోచేత నుదుటిమీది చెమట ముత్యాలు కొనగోటితో రాలుస్తు, కర్షకుడు కళ్లెత్తి చూస్తే, అదుగో, ఆదేవళాన్ని చుట్టిఉన్న సుందరగ్రామమూ, దానిలో తన తీయని ఇల్లూ ఆహ్వానిస్తాయి.

మావిమద్దివేపతోపులనడుమ పరచుకొని ఉన్న బీళ్లల్లో పశువులను కాచుకుంటూ, కాపరి చెట్టునీడలో ఒరిగి, అరమోడుపు కన్నులటు త్రిప్పి చూస్తే, కోవెల విమానమూ, పల్లీ, కుటీరమూ, అన్నీ త్వరగా రమ్మంటున్న ట్టుంటాయి.

పట్టణమో పరగ్రామమో పనిమీదపోయి తిరిగి వస్తుంటే, దవ్వుదవ్వులనుంచే ఆలగిట్టలు రేపేధూళులలో నుంచి స్పష్టాస్పష్టంగా దేవాలయశిఖరం "ఇటూ, ఇటూ, త్వరగా, త్వరగా" అన్నట్టు పిలిస్తే, బరువునడలలోకి దురుసు తనం వచ్చి, కనబడని ఊత ఏదో దొరకడంవల్ల, కొత్త ఊపూ, ఉల్లాసమూ గ్రామవాసుని హృదయంలో కలుగుతాయి.

తెలుగునాటిలో కోవెల లేని ఊరు లేదు.

కాని కోవెల కోవెలకూ పొలనులేదు.

నదీ తటానా, కాలువ ఒడ్డునా ఉన్న దేవళాలకు కొలను లేకపోవచ్చు. కొన్ని సామాన్య దేవళాలనంటి బావులే ఉండవచ్చు. కాని క్షేత్రాలలో ఉన్న ప్రతి ఆలయానికీ కొలను ఉన్నది.

కోవెల నంటి ఉన్న కొలనును కోనే రంటారు. కొలను లన్నీ కోనేరులు కావు.

ఒక్కొక్క కోనేరు పుష్కరిణి. దీనిలో పద్మాలు ఉంటాయి. కొన్ని కోనేరులు కైరవిణులు.వీటిలోతెల్ల కలువలుంటాయి.ఒక్కొక్క దేవళపు కోనేటిని గుండమంటారు. శ్రీ రంగం లోనిది చంద్రపుష్కరిణి. పిఠాపురం కుంతీమాధవ స్వామిది మాధవ పుష్కరిణి. పార్థసారథి స్వామిది కైరవిణి అంటారు. కోటిఫలిలోనిది సోమగుండం. కుమారారామంలోనిది భీమగుండం. దక్షారామములోనిది సప్తగోదావరం. కోరుకొండ లోనిది భవనాశని కాబోలు. తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి దేవళానికి ప్రక్కనే కొండమీదనే కోనేరు ఉన్నది. కోటప్ప కొండమీదగుడి, కింద యల్లమంద గ్రామంలో కోనేరు. సింహాచలం మీద ధారలున్నాయి. నరసింహస్వామి అర్చకులకు కోనేరక్కరేలేదు. కమలాద్రినిలయుడైన మార్కండేయస్వామి గౌతమీతీరానే దేవళం నిర్మించుకున్నాడు.

కొండకు నడుమ కోనొక టున్నది.
కోనకు నడుమ కొల నొకటున్నది.
కొలని గుట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ !

వారణాసి నుంచి ప్రవాసియై వేదవ్యాసమహర్షి భీమఖండము సమీపిస్తాడు. ఇటు పీఠికాపురంనుంచి పల్వల గ్రామం వరకూ భీమఖండమే.

భీమఖండానకు మొదటి హజారం పిఠాపురం.

పిఠాపురంపైన, ఆకాశాన నిలబడి, వేదవ్యాసులు సప్త గోదావర

సీమనంతా సందర్శిస్తాడు."అదె పట్టిసము, కోటిపల్లి అదె, పలివెల," అంతర్వేది, దక్షారామ, తుల్యభాగ, సంపర, కుమారారామం, సర్పవరం, పిఠాపురం. ఏలాగౌతమీనదుల మధ్యనున్న ఆపచ్చపచ్చని సీమలో, ఆరామాల నడుమా, కేదారాల నడుమా, ఆలయాలూ, గోపురాలూ, అర్చనలూ, యాత్రికుల కలకలమూ చూసి, పులకరించీ వ్యాసమహర్షి కాశికావిప్రయోగంవల్ల కలిగిన తాపం ఒక్కసారి చల్లారి పోయినదను కుంటాడు.

పీఠికాపురం దక్షిణకాశి. మన పుణ్యభారతంలో ఉన్న గయా క్షేత్రాలలో పిఠాపురం ఒకటి; పాదగయాక్షేత్రం. పంచమాధవాలలోనూ ఒకటి; కుంతీమాధవులు ఇక్కడ విజయం చేసి ఉన్నారు. ఉజ్జయిని, కాశీవంటి అష్టాదశపీఠాలలో ఒకటి;పురుహూతికా శక్తి "ననిచి కాపుండు ఈ నగరి కెలన", మరి మున్నూట ఆరువది మూర్తి భేదములతో విహరించు నావీటవేల్పు పిండు."

అంతేకాక, ఈ నగరలక్ష్మికంఠాన్ని చుట్టి ముత్యాల హారంవలె ఏలేరు ప్రవహిస్తుంది. గోదావరీ వారికి సర్వసస్యాలూ ఫలిస్తే, ఏలేటి నీటికి బంగారం పండుతుంది. పట్టణం చుట్టూ మావి, పనస, కొబ్బరి, చెరుకు తోటలూ, పచ్చనిచేలూ.

పిఠాపురానకు ఒక దిక్కునుంచి వస్తే, చాలాదూరం నుంచి కుక్కుటేశ్వర స్వామి దేవాలయశిఖరం కనబడుతుంది. ఈ దేవళం ఊరుబయట ఉన్నది.

దేవాలయావరణలోనే "పాదగయ" అనే కొలను ఉన్నది. పాదగయకు పడమటివైపున్న కోవెల ఉంటే, తూరుపున కోవెల తోట ఉన్నది. కోవెలతోటలో పూవులూ చివుళ్లూ దళాలూస్వామి అర్చనకే.

పాదగయ తీర్చి కల్పించినట్లు నలుచదరంగా ఉంటుంది. నాలుగువైపులా రాతి మెట్లు ఉంటాయి.

ప్రతికొలనుకూ మెట్లుండవు. కోనేటికి మెట్లుంటాయి. ఆ మెట్లు అరిగిపోయి ఉంటాయి.

వ్యాసభగవానుడు మొదలుకొని, నా వరకూ ఎందరి పాదాలకింద నలిగీ, అరిగీ, అలాగ ఉన్నాయో పాదగయ మెట్లు, ఆ కోనేటికే తెలుసు.

కాలాలూ, పరిమితులూ దాటి వచ్చిన ఆ కోనేటికి తెలియని సంగతే లేదనుకుంటాను.

యుగయుగాలనుంచి ఆధివ్యాధిపీడితులు, ఋణగ్రస్తులు, ప్రపన్నులు, యాత్రికులు, జారులు, చోరులు, అమాయకులు, కుటిలులు, కుహనాభక్తులు, ఆవేశంతో, ఉబుసుపోక, పర్వదినాలలోనూ, ప్రతిదినమున్నూ దేవళానికి వస్తూనే ఉన్నారు.

అయితే కోవెలలో అడుగు పెట్టడానికి కోనేరు అనుమతి ఇవ్వాలి. కోవెలకు కోనేరు ఉత్తరువు.

ఒక్కొక్క మెట్టే మానవుడు దిగుతుంటాడు.వాని అంతరంగం కోనేటికి తెలుసు. తెలుస్తే మాత్రం !కోనేరుతల్లి అందరనూ కడిగి కడిగి, శుభ్రపరచి, వెన్ను చరచి, అనుమతి ఇచ్చి, అలలగలగలల ద్వారా అభయమంత్రం చెవిలో ఊది, దేవాలయంలోకి పంపిస్తుంది.

ఆ కోనేటి మెట్లమీద ఏమి జనం ! ఎన్ని ప్రకృతుల జనం !

పై మెట్టుమీద ఒడలు తుడుచుకుంటూ, మరో మెట్టుమీద జంకుగా లోనికి దిగుతూ, సగం నీట నిలబడి మునుగుతూ, స్త్రీలూ, పురుషులూ, వృద్ధులూ, పిల్లలూ ! స్నానం చేస్తున్నప్పుడు మంత్ర పారాయణం. మునుగుతున్నప్పుడు నీటి చప్పుడూ, చెంబులూ బిందెలూ జారీలూ ముంచిన ధ్వనులూ, అలలు రాతి మెట్ల మీద కొట్టుకునే ఉలివూ, ఇలాగ అరుణోదయానికి పూర్వంనుంచీ ప్రదోష సమయం దాటేవరకున్నూ.

"అడ్డదిడ్డంబుగా బొదలనిండుకున్న వలిపంపు మడుగు దోవతుల పిడుపల"తో కొందరు, "అళిక ప్రదేశాదికాంగ కమ్ముల లెస్సబ్రామిన దట్టంపుభస్మరేఖల"తో కొందరు, "కడు శుభ్రముగదోమి, కుడికేల దాల్చిన ఆతామ్రమతామ్రమయాంబు పాత్రల"తో కొందరు.

కోనేటి మెట్లమీద నుంచి భక్తులు దేవళంలోనికి పోతుంటారు.

ఇక అరుణోదయానికిముందే కుక్కుటేశ్వర దేవదేవుడే మూడు భంగుల కొక్కొరోకో అని ఉషఃప్రవక్త అయితే, భైరవస్వామి రేయంతా ప్రహరితిరిగి, కొలని నీటిలో స్నానమాడి, తన చిన్నగుడిలో "గాఢనిద్రా భరారుణాక్షి" మొగిడ్చి విశ్రమిస్తే, డుంఠి వినాయకుడు కనక కుంభంతో కోనేటి నీటితెచ్చి, కోవెలతోటలో పూలచెట్లలో బోదెల్లో పోయడమూ అంతా, జరిగి ఉంటుందని విశ్వాసులంటారు.

ఆ కోనేరే మంటుందో !

సంధ్యాసమయంలో, అమ్మవారైన రాజరాజేశ్వరీ దేవి "రత్నఖచిత సింహపీఠికా, కొలువుండి చిత్తగింప" పరమ శివుడు కావించే తాండవం దేవతలూ, దివ్యర్షులూ వీక్షించడానికి వచ్చేవారట. కుంతీమాధవ స్వాములున్నూ తమ ఆలయం నుంచి చూడికుడుత్తనాంచారుతో వేంచేసి, తాము కూడా శివతాండవం చిత్తగించేవారంటారు.

ఆ కోనేరేమంటుందో !

అక్కడ మాధవ పుష్కరిణి. తెప్ప తిరునాళ్ళు. కోనేటి చుట్టూ మెట్లమీద దీపాలు. కోనేటిలో మండపం. ఆ మండపం ఒడలంతా దీపాలు. మండపంలో స్వామి. ఇంతలో పూలతో ఆకులతో దివ్య విమానంలాగ నౌక. దానిలో మాధవస్వామీ, దేవీ. ఆ సమయాన రాజరాజేశ్వరీదేవి, కుక్కుటేశ్వరప్రభువూ కూడా అతిథులుగా వచ్చి ఆ నౌకపై కూర్చున్నారేమో ! చుట్టూ రాత్రి, చీకటి ! ఊరిబయలు. పైన నక్షత్రాలు. నలువైపులా భక్తుల హృదయాలలాగ దీపాలు. అటుచీకటిలో నుంచి కుంతీ మాధవ స్వామి "దివ్యమందిర విమాన దేదీప్యమాన విపులధామ ధామ సుదర్శన దర్శనంబు" జనం. కోలాహలం. నిశ్శబ్దం. కోలాహలం అడుగునా, నిశ్శబ్దాన్ని నిండీ, కోనేటి తరగల రవళి.

ఉత్సవం ముగిశాక గ్రామస్థులందరూ తమ ఇళ్ళలో సుఖశయ్యల మీద కన్ను మోడ్చి నిద్రపోతున్నప్పుడు, భగవంతుడు అక్కడా ఇక్కడా వచ్చి, దేవితో కోనేటి మెట్లపై కూర్చుండి, నీటిలో కాళ్ళాడిస్తూ

ముచ్చట లాడతాడేమో !

ఏమో ! కోనేటికి తెలియాలి.

కుమారారామ భీమేశ్వరస్వామి దేవళం చామర్లకోట రైలు స్టేషనుకు ఆవలిపక్కనున్నది. ఈవల ప్రక్కబస్సులతో, విపణులతో కొత్త ఊరు. స్టేషనులో ట్రెయినులూ, అరుపులూ. అటు చెరకుతోటల నానుకుని చాళుక్యులు కట్టించిన భీమయదేవుని మందిరం. అంతకన్న ప్రశాంత మనోహరమైన క్షేత్రం లోకంలో లేదు. పక్కనే భీమగుండం కొలను. అంత కన్న నిద్రాళువైన కోనేరు మరోచోట లేదు.

అక్కడ ఒక చిన్న గ్రామం లేచి, మేలుకొని, ఇటు స్టేషను కీవలి పట్టణం కొన్ని మైళ్ల దూరానకు జరిగితే బాగుండు ననిపిస్తుంది.

మరి దేవళంలో కాగడాలే కాని విద్యుద్దీపాలు బాగుండవు. విద్యుద్దీపాల కాంతికి అవధి ఉంది. దుస్సహ మైన స్పష్టత ఉంది. కాగడాల పక్కనే పొంచి ఉన్న చీకట్లు మన అంతరంగాలంత లోతుగా ఉంటాయి. కాగడాలు కునుకుతూ దేవాలయాన్ని వింతగా చూపిస్తాయి. కాగడాలు ఊగుతూ కొలనులో వెలుగు తరగలను లేపుతాయి....

కోనేరూ, కాగడా, ఘంటా శంఖాల ధ్వనీ, సాయం కాలపు సన్నాయీ, తులసితీర్థమూ హారతీ పూవులూ కలసిన వింత వాసనా, ఇవన్నీ కలిసి గ్రామశోభతో నా మనస్సులో ఎప్పుడూ ఉంటాయి. ముఖ్యంగా కోనేరు.

కోనేటి నీళ్ళల్లోకి ఒదిగి నే నెన్నిసార్లో నా ప్రతి బింబమే కాదు నాహృదయాంతరాళాలు కూడా చూచుకున్నాను. అలాగ చూచు కున్నప్పుడల్లా, కోనేరు నా సంగతి తెలుసుకుని గలగలమంటుంది. ఉసురుసురంటుంది. నేనప్పుడు కోనేటి కడుపులోనుంచి గోపుర శిఖరమెక్కుతాను.

పాతాళంనుంచి పరమపదానికి కట్టిన నిశ్రేణి ఉండనే ఉండదు. కోవెల పక్కనే కోనేరు లేకపోతే. కోనేరు మొదటి మెట్టు.

* * *

# సువాసన ద్రవ్యాలు

అసలు, సుగంధం అనగానే ముఘులాయీ భోగ జీవిత మెందుకో స్ఫురణకు వస్తుంది.

రాచ నగరో, వెలమ దివాణమో, హజారంలో గులాబీ గుల్షబులూ, లోనికి అడుగు పెట్టగానే సవారీల చావడిలో హుక్కాధూమవాసనలూ, హవేలీ అంతా అగరు అంబరు పరిమళాలూ, పక్కన పాలరాతి మెల్లా, ఆ చక్కని పెరడూ, ఆ పెరటిలో అనార్కలీలతో ఒక్క దానిమ్మచెట్టూ, ఒక్క మల్లిపందిరీ, ఒక్క జాజి ఓవరీ, అక్కడ దిడ్డిగంత దాటగానే అందచందాల చమన్, దానిలో వన్నెలకన్న వాసనలే మిన్నగా ఉన్న రకరకాలపూల చెట్లూ, నడుమ ఒక్క పొగడమానూ, ఆమాను క్రింద అరుగూ, అరుగుపైన తమంతతామేరాలి పాన్పుగా అమరిన వకుళాలూ, చమన్ లో నుంచి మెల్లాకూ మెల్లానుంచి జనానాకూ నడయాడే ఒయ్యారుల ఉప్పాడ ఉల్లిపొర జరీబుటా పై మడతల నుంచి కొసరి కొసరి గుభాళించే వలపులూ, ఆనాటి ఆ భోగ పరిపాటి అంతా మాటిమాటికీ మనస్సులో గుబులు కొంటుంది.

సందెవేళ నుంచి సరసుని జీవితం మొదలు. అప్పుడే అంతఃపురాలలో అలంకరణాలు కూడా ఆరంభం. అత్తరు తావులూ, సాంబ్రాణి పొగలూ, ఆ సమయాననే మంది రావరణంలో ఇముడక, వాకిలిదాటి, వాడలో చొరబడతాయి.

ఒక తెలుగునాటి కవి అన్నట్లు -

తళుక్కు టద్దంపు నిద్దపు నిల్వుటద్దముల్,
దంతంపు దువ్వెనల్, తావు లొలుక్కు
నత్తరు, పునుగును, అంబరు, గౌళ క
ప్పూరముల్, నఖము, గంబూర చోష
జల్లి సవరములు, జిల్ల రసము, కదం
బము, గోవ జవ్వాజి, పచ్చిపునుగు,
కురువేరు, పచ్చకప్పురము, పన్నీరు బే
డెము, మలాకలు, కుంకుమమును మంచి
బుక్క, కస్తూరి వీణెలు, చొక్కటంపు
టగరు సంపెంగ నూనెలు, ఆది యైన
మెచ్చ గల దీవులందుండి తెచ్చినట్టి
వివిధ పరిమళ వస్తువుల్ వెలకు దీసి -

సామంతులు తమ మందిరాలలో నింపుకుని దినదిన జీవితమును నవనవ సౌరభములతో వాసింప జేసుకునేవారు ఆ రోజులలో.

లేవడి బ్రతుకప్పుడూ ఇప్పుడూ, పాపం, లేవడి బ్రతుకే.

కాని అప్పటి సామంతుల భోగపద్ధతే వేరు. వాళ్లు సరసులు. వాళ్ళు కవికి గాని, గాయకునకు గాని కానుకలిచ్చి నప్పుడు కూడా, కస్తూరి మెదిపిన గందపు పూతతో కప్పురవిడెముతో ప్రారంభించేవారు. ఆ గుబాళింపుతో కవి శ్రీనాథుడై గమ్మని ఆలపించేవాడు.

నాటి ప్రభువు దినచర్య ఎలాగ ప్రారంభించే దయ్యా? పెన్నెరుల నిండా అంటిన సంపెంగనూనె, శరీరం అంతా పునుగు జవ్వాదులతో అటకలి, గొజ్జిగివారి తొరిపిన తెలినీటిపోతా, గంధామలకమూ, తరువాత స్వచ్ఛ సురభిళాలైన వలిపపు కండువాలతో ఒడలంతా ఒత్తుకోవడమూ, పిమ్మట సాంబ్రాణి ధూపము ! ఇటువంటి అభ్యంజనముతో ప్రభు జీవితం ప్రారంభం.

ఇక ధూపమైనా ఒక్క సాంబ్రాణీతోనే కాదు. దశాంగముతో, సురభితో, మలయానిలముతో, మహిషాక్షితో, మడ్డితో – ఇటువంటి వెన్నిరకాల సుగంధ ద్రవ్యాలతోనో !

అసలన్నిటికన్న సాంబ్రాణే అతి మనోహరమైనది. పొడిపొడిగా విడివడిన పాయపాయకూ, ప్రతి కుంతలానకూ పట్టుకొని, పదేపదే నాసికాపుటాలను దినమంతా పలుకరిస్తూ ఉంటుంది ఆ సాంబ్రాణి సౌరభం. అది మనస్సును నిలవనీయదు; వెంటనంటి తరుముతుంది.

మన కావ్యాలలో నాయకులందరూ ఇలాగే అభ్యంజనం కావించారు.

పారిజాతాపహరణంలో కవి అన్నాడు - శ్రీకృష్ణ దేవునకు కంకణఝణత్కారము తొరముగా సంపెంగనూనె అంటి -

"తామరదోయిలో తగిలి
దాటెడు తేటుల బోల, పెన్నెరుల్
వేమరు చేతులన్ విడిచి,
విప్పి, విదిర్చి, నఖాంకురమ్ములన్
కోమలలీల దువ్వి, తెలి
గొజ్జగినీ రెడ చల్లి చల్లి, గం
ధామలకంబు బెట్టినొక
యంగన ......................" అని.

ఎటొచ్చీ, ఆ మహానుభావుడు కృష్ణస్వామి ఎనిమిది రకాల అభ్యంజనాలు ఎనిమిది రకాల సుగంధ ద్రవ్యాలతో చేసి ఉంటాడు, ఎనమండుగురి ఇళ్ళల్లో.

కథలలోని వారిలోనేగాక, మనం ఎరిగున్న కలవారిలో కూడా కమ్మసంపెంగశిరసంటు కద్దు. గొజ్జగి నీటిమజ్జనం మాత్రం కొందరికే. జవ్వాది పునుగులనలుగు బదులు కచ్చూరాలూ, వట్టివేళ్ళూ, పచ్చాకూ మొదలైనవి కలిపి కొట్టిన నెత్తావి పిండి మాములు, సాంబ్రాణి పొగ ఎందరికో.

"కమ్మని పిసాళివలపులు క్రుమ్మరించు కమ్మజవ్వాది" తోనే కవి వసురాజుకు తల అంటించాడు. తార శశాంకునకు సంపెంగనూనె రాచింది. ధూర్తగోపాలుడు చలచిత్తుడని కాభోలు సంపెంగనూనెతో నిమ్మరసం కూడా శిరస్సునకు రుద్ది, సాంబ్రాణి ధూపమే వేసి, జవ్వాజి చేతికి రాచుకుని, మరీ కృష్ణుని కురులు చిక్కులు తీర్చింది రాధాదేవి.

ఈ విధంగా అభ్యంజనం చేసిన ప్రభువును నేనూ ఎరుగుదును.

తరువాత జిలుగువలువలకు అత్తరుపూతలు,అత్తరుఅన్నమాట వినగానే మనస్సుకు ఏదో వాసన హత్తుకున్నట్లుంటుంది.

ఈ యత్తరు లెన్ని రకాలు !

గంధరాజం గడసరిది. మల్లెయత్తరు వేసవిసంజవేళది. గులాబి రాచకొలువులోనిది; దీనికి మర్యాద ఎక్కువ. అంబరు అన్నివేళలా బాగుంటుంది. వట్టివేళ్ల అత్తరు ఘర్మవేళది. కాని ఇవన్నీ కృష్ణాగరుముందు దిగదుడుపు. ఇది గాటముగానూ, కోమలముగానూ కూడా ఉంటుంది. ఇది రకరకాల ఊహలను రేపుతుంది. ఖిల్లాలూ, జనానాలూ, వాటిలో మేలిముసుగుల వారితో పాదుషాలు జరిపిన మంతనాలూ, రహస్యాలూ మధ్యయుగం నుంచి తెచ్చి మన చెవిలో ఇప్పటికీ ఊదుతుంది ఈ యత్తరు.

కృష్ణాగరు కనోజ్ నుంచే రావాలి. గులాబి కాశ్మీరం నుంచే రావాలి.

ఈ యత్తరులమాట ఎత్తగానే ఒక మూర్తి కనబడుతుంది. ఇప్పుడది తెలుగునాటి పట్టణాల్లో అంతగా కనబడదు. కాలికి పూసినట్లు తొడిగిన షర్వా, పైన జిలిబిలి నగిషీ అంచుల పలచని అంగరఖా, ఆపైని కుచ్చుతో ఒయ్యారపు బంగారు జలతారు కమ్మీల పగిడి, కంటికి సుర్మా, కాళ్ళకు చెడావులు, బుజముపైన ఎర్రరుమాలు, చంకన ఎర్రబొంబాయి గుడ్డచుట్టిన పెట్టె, వీటితో అత్తరు సాయెబు, దివాణము హజారములోనేకాక, గొప్పవారి లోగిలి వాకిలిలోనేగాక, సామాన్యుల పెండ్లి పందిళ్ళలోకూడా సాక్షాత్కరించేవాడు. ఈతనికి మలయానిలం

ప్రాణమిత్రం, చోపుదారుగూడా. అది రెండు వీధుల కవతల నున్న ఇతనిరాక ముందుగానే తెలుపుతుంది.పుల్లిలకు అగరు అంబరు చంపా చమేలీ దమనం మరువం రాచి ఇవ్వడము, ముంజేతులకు పూయడము! ఈయనగారి అనుగ్రహం వల్ల ఒక్కొక్కడు ఒక్కొక్క అత్తరు పేటిలాగ రోజురోజంతా గుబాళించేవాడు.

కలవారి దినచర్యలో తరువాతది భోజనం. "భోజనోద్యోగవేళ" కూడా అగరుధూపం పెట్టేవారట బోనగత్తెలు.

ఆ తరువాత తాంబూలం.

కప్పురం లేని తాంబూలంలోనే కమ్మనివాసన ఉన్నది. ఆ తాంబూలానకు "ఒగ రించుకయులేక మిగులంగతీపైన వక్కలు" ఉండాలి. "ఒఱపైన కమ్మవలచి దళమెక్కి పండిన తాంబూలదళములు" ఉండాలి."కాలోపలంబులు కాల్చి పడియగట్టినట్టి చూర్ణం ఉండాలి - అని విజ్ఞుడు చారుచర్యలో చెపుతాడు.

అయితే, సామంతులకివి చాలవు . వీరికి పచ్చకప్పుర మున్న వీడెము "వదన వికాస సౌరభవివర్ధనకారీ.మదన పునర్జీవీకరణ మంత్ర"మున్నూ.

మరి పండుటాకులకు రాచేది మంచిముత్యాల సున్నమట ; "తెలివిచ్చు చాల ముత్తియపు సున్న" మన్నారు. ఇవి కూడా చాలవు. ఏలకులూ,జాజికాయా జాపత్రీ,కుంకుమపువ్వూ వీటన్నిటితో కలిపిన తాంబూలం వేసికొన్నవారెవ్వరో ఒక్కసారి తాంబూలపు తావి బుగ్గరన చెవిదండ గుసగుస లాడితే, ఒక్క ఉదుటున "కలిత ఘనసార ఘనసార గంధసార ఘుసృణ మృగమదపంక సంకుమద ముఖ్య సముచిత వస్తుభాసుర" మైన శయనాగారం ప్రవేశించేవారు మహానుభావులు.

అక్కడ మళ్ళీ ఉశీరపుసురటులూ, అత్తరుపూతలూ, పన్నీటి జల్లులూ, చందన చర్చలూ, కప్పురవిడేలున్నూ.

ఈచందనచర్చ మండువేసవిలోనే మంచిదనుకుంటాం. కాని, కప్పురమూ గొజ్జగినీరూ కలిపి గ్రీష్మములోనూ, కస్తూరీ ఘుసృణమూ

కలిపి వర్షాకాలములోనూ, అగరూ కుంకుమ పువ్వూ కలిపి శిశిరములోనూ, గందంపూసుకునేవారట.

ఇక విరహానలంలో వేగిపోయే సామంతుల ఉపచారాలెలా ఉండేవి? చంద్రఖండ మలదికొని, "పుష్పాళ్లు కురులపైన పోసి పోసి, కన్నులు పన్నీట తుడిచి తుడిచి, మేనిపై కప్పురపు ధూళి కుప్పి కుప్పి" తేరుకోవడానికి ప్రయత్నించేవారు. సెజ్జపై గొజ్జగినీరు చల్లి, మల్లెలూ సన్నజాజులూ పరచుకునే వారు, పాపం !

మరి పువ్వులకన్న మధురసురభిళాలైన వస్తువులు ఏమున్నాయి!

"గేదగిపువ్వు దాలిచి
సుఖింతురు, మేలుజవాది పూని హృ
న్మోదము గాగ, గన్నేరులు
మొల్లలతో వకుళప్రసూనముల్
జాదులు పాటలమ్ములును
సంపెగలున్ శతపత్రకమ్ములున్
శ్రీ దనరారు భోగులు
ధరింతురు కస్తూరి గూర్చి వేకువన్.

వేసవి రాత్రుల పన్నీరు చల్లిన మొల్లా జాజీ కరవీరం కురువేరూ. మేఘమాసాలలో నిర్భరశీతోష్ణములు కాని గురువిందలూ నవమాలికలూ పాటలాలూ, మరి సీతుకారులో చేమంతులూ పొన్నలూ సురపొన్నలూ సంపెంగ మొగలి పొగడలూ.

జాదులవాసన రెండు గడియలట. విరజాజులది నాలుగు గడియలట. పొన్నది జాము. మల్లెది జాము, గన్నేరు గురవింద పొగడలది రెండు జాములు. సంపెంగవాసన ఒక పగలూ ఒకరేయూ వాడదు. దీనికి రెట్టింపు చెంగల్వ చేమంతుల వలపు. కలిగొట్టు సురపొన్నల సౌరభము వాడనే వాడదట !

పాన్పుపై పరచవలసినవి మల్లెలూ విరజాజులున్నూ.

సుందరములూ సురభిళములూ అయినా, పారిజాతాలు

అర్చనకేగాని అలంకారానకు కావనిపిస్తుంది. పారిజాతం విరహి యయిన భక్తుని వంటిది; లోపల రక్తహృదయం, పైకి శాంతధవళమూర్తి.

వర్షాకాలంలో పూచే మొగలిపూవు పొదలచాటున నీలిమబ్బులలో మెరపులాగుంటుంది.

హేమంతపుచేమంతులు స్వామికి తిరునాళ్లలో బంగారు విమానాలు కడతాయి.

నా మనస్సులో వకుళవాసనలూ వెన్నెలరేలూ వేణు నాదమూ కలిసిపోయి, పరిమళమూ తీయదనమూ విడదీయలేనట్లు ఉంటాయి.

వకుళవాసన ఎంత మృదువో దాని వన్నె అంత వింత.

వేసంగిలో సందెవేళలోనే కచ్చూరాలూ పచ్చాకూ వట్టివేళ్ళూ కలిపి మెదిపిన ముద్దతో ఒడలు నలుచుకుని, స్నానము చేసి, వచ్చిన ప్రియురాలైన ఇల్లాలి మేని వలపు కన్న, శిరోజాల సౌరభముకన్న, యువహృదయాన్ని వివశం చేసే ఆమోదం మరొకటి లేదు. మరి ఆమె కురులలో మల్లి చేరులు కూడా ముడిచాక చెప్పాలా?

ఒడలంతా పసుపుతో నలిచి నలిచి, దానిమీద అహరహమూ అంటుకున్న కర్పూరపుదండలపరిమళం పట్టుకోగా పట్టుకోగా, కొత్తవధూవరుల మధుపర్కాల ముగ్ధ వాసనకన్నా మోహన మైనది వేరొకటి లేనేలేదు.

ఆనందజీవిత ప్రాంగణంలో అడుగుపెట్టే కొత్త ఆలుమగలకు నవకేళీమందిరంలో అగరువత్తులూ గందవొడులూ వీడెములూ విరిమంజరులూ విరజిమ్మే వలపుకన్న తీయనివి అసలులేనేలేవు.

సువాసన పిలుపువంటిది; పదిమంది నాకర్షిస్తుంది.

సౌరభం పక్షివంటిది; దిక్కు దిక్కులా గాలిమీద పరుగెత్తుతుంది.

సుగంధం స్మృతి వంటిది;పదే పదే స్ఫురిస్తుంది.

పరిమళం పట్టుకుని ఏడవని బలవంతపు బంధువు కాదు. తరిచూచి దరియవచ్చే నేస్తం.

ఆమోదానికి స్వార్థం లేదు; కలిసిగట్టుదనం ఎక్కువ; అందరికీ

అనుభవం పంచిపెడుతుంది.

అన్ని రకాల సౌరభాలూ ఆదికాలంనుంచీ సహృదయుల నాకర్షిస్తూనే ఉన్నాయి. అప్పుడు నెమ్మేనులకూ నిట్టూరుపులకూ కూడా నెత్తావు లంటి ఉండేవి.

"అంగనాజనుల ఉత్తుంగసంగతకుచ
కుంకుమ చందన పంకములయు
వారివ ధమ్మిల్లభారావకలిత ది
వ్యామోదనవపుష్ప దామములయు
వారివ ముఖసకర్పూరతాంబూలాది
వాసనా సురభి విశ్వాసములయు
వారివ పరిధాన చారు ధూపములయు
విలసిత సౌరభావళులు దాల్చి
అనిలుడను దూత వోయి" –

అభినవ తారుణ్యసీమలోనికి యయాతిని ఆనాడు ఆహ్వానించుకొని వచ్చాడు.

కాని, ఈ వాసన లన్నిటినీ మించిన సౌరభము దేవాలయములోనిది. ఆ చోటకూడా ఆ పచ్చకప్పురమే, ఆ చందనమే, ఆ పుష్పమే, ఆ కుంకుమే.

అయితే ఆ కుంకుమకు అమ్మవారి చరణసాన్నిధ్యం మరీ రక్తి నిచ్చింది. ఆ పుష్పాలకు స్వామి పాదపరిమళం కూడా అంటుకున్నది. ఆ ద్రవ్యాలన్నీ తులసి నీటిలో తొప్పదోగినవి.

* * *

# మా ఊరు పోయింది

ఈ నడుమ మా ఊరికి వెళ్ళి ఉండాలని నాకు అదే పనిగా అనిపిస్తుంది. మా గ్రామం ఎన్నడో వదిలేశాను. మహానగర వాసానికి మరిగాను కూడా. అయినా, అలాగ అనిపిస్తుంది నాకిప్పుడు అక్కడికి వెళ్ళి ఉండిపోవాలని !

ఈ మధ్య నా తల్లిమీదికి కూడా నా మనస్సు ఊరికే పోతుంది; మా అమ్మ ఎప్పుడో పోయింది.

పదిమందిని కూడగట్టుకుని ఎప్పటి కప్పుడు కాలక్షేపం చేయడం అలవాటు నాకు. నాకెప్పుడూ చుట్టూ జనం ఉండాలి. మనిషంటే మహాఇష్టం నాకు.

నా ఆప్తమిత్రులొకరున్నారు, బహు భాషావేత్త, బోలెడు చదివారు, ఆయనంటారూ, "ప్రపంచంలో దొరికే గ్రంథాలన్నీ ఒక విజనస్థలంలో పెట్టి, అక్కడి కొక్క నరమానవుడు రాకుండా కట్టుదిట్టం చేసి, నన్ను వదిలివేయండీ; నేను హాయిగా ఉంటాను", అని. నా కాయాన్ని చూస్తే భయమూ, జాలిన్నీ ! అలాంటి చోటికే నన్ను విసిరివేయవలసి వస్తే, ఏ మొరకునో మొరటునో ఒక మనిషిని మాత్రం కూడా ఇయ్యండీ" అని మొరపెట్టుకుంటాను.

అలాంటి నాకు పట్టణవాసం మరీ బాగుంటుంది కదా, సావాసాలతో సందడులతో.

ఎన్నేళ్ళనుంచో నగరంలో ఉండిపోయానునేను. అలా ఉండగా ఆప్తులుఒక్కొక్కరే ఈ లోకం నుంచి వెళ్ళిపోవడం మొదలు పెట్టారు అమ్మా, అక్కాచెల్లెళ్లూ, అనుగునేస్తాలూనూ ! అయినా ఒంటరితనం అనేది, అంటే, "నా కెవ్వరూ లేరు" అనేభావం, నా మనస్సులోనికి ఎన్నడూ రాలేదు. ఒక ఉత్సవంలాగ జరిగిపోయాయి అర్ధవైఏళ్ళు, కొత్త మొగాలతోనూ, కొత్తవేడుకలతోను, తిరునాళ్ళలాగా.

అసలు నాకు నెమరువేత డోకు, అంటే, వెనక్కి తిరిగి చిన్ననాడో, ఎన్నడో జరిగినవి జ్ఞాపకం చేసుకోడం. అది అసహ్యం.

ముసలితనానికి ముందుకు చూసుకోడం భయం. దానికి వెన్నుమీద ఉంటాయి కన్నులు.

ముసలితనం, పాపం, ఏకాకి. పదిమందిలో ప్రవాసం అది. నా కది కిట్టదు. "నా చిన్నప్పుడేం, ఒకసారేం" అని ఎవరన్నా మొదలెడితే నాకు మంటేసుకొస్తుంది.

ఇలాగ ఉండగా, పడింది పిడుగు నామీద. అలాగ బతుకుకుంటూ వచ్చిన నాకు తగిలింది అఘాతం, అదివరకెన్నడూ ఎరగనిది.

అప్పుడయిపోయాను ముసలిని, ఒంటరిని.

అన్ని ఏళ్ళూ గడిచీ, అంతదవ్వూనడిచీ,ఆఖరున హఠాత్తుగా ఆగిపోయినట్టనిపించింది యాత్ర, కాళ్ళు రెండూ లేక, కళ్ళురెండూ ఆరిపోయి, కడపలకూడా లేక, తెరువుకూడా చచ్చిపోయి జరగనట్టు.

అమ్మయ్యో ! అంతకన్నా దుస్థితి మరొకటుండదు.

అప్పుడు కనిపించింది నాకు ఒంటరితనం.

ధారాళంగా ఇటూ అటూ పోయే రహదారిమీద అనునిమిషం అటూ ఇటూ పోయేజనాన్నీ, బళ్ళనీ, సందళ్ళనీ చూస్తూ, కదలలేకండా నిలిచిపోయింది బ్రతుకు, మైలురాయిలాగ.

అప్పుడెందుకో అన్నాను, 'అమ్మా' అని. ఎన్నాళ్లకో అమ్మఒడిలో తలపెట్టుకొని పడుకోవాలనిపించింది. అప్పుడు అమ్మ నా ఒళ్ళు నిమిరితే, మళ్ళీ అడుగు వెయ్యగలననిపించింది. అప్పుడే మనస్సుకూడా

వెనక్కి చూడడం ప్రారంభించింది, చిన్ననాటిదాకా.

అప్పుడే మా ఊరిమీదికి కూడా పోయింది మనస్సు. అప్పటినుంచీ నా ఊహలు ఈ ముసలితనంలో అక్కడికే పరుగెత్తుతున్నాయి, సాయంకాలం గూటిలోకి పక్షుల్లా. ఏవో జ్ఞాపకం వస్తాయి ఎల్లవేళలా, మా అమ్మలాంటి మా గ్రామమూ, పరిసరాలూ, అక్కడి ప్రజానూ.

ఈ మధ్య ఒక ప్రియమిత్రుడు, "నీ విప్పుడు ఏమి మాట్లాడినా, ఏమి వ్రాసినా, మీ పల్లెటూరూ, ఊరుపక్కఏరూ, ఏటి ఒడ్డున వెదురుపొదా, పొదచెంత పుంతా, పుంతకి వెనక మావితోటా, తోట కవతల వరిచేలూ, గట్లూ, సంటకాలువలూ, కోతలూ, నూర్పులు రామమందిరాలూ, రచ్చ చావళ్ళూ, రావయ్య కాపూ, హరిశాస్త్రులూ, పాలేరూ, ఊరిబావి దగ్గర సూరమ్మా పేరమ్మా, నారయ్య పెళ్ళీ, ఇదే గొడవ ! చాదస్తుడవైపోయావు ! ఇంత పట్టణం, ఇందరు జనం, ఇన్ని సందళ్ళూ, నిన్ను పలికించడం లేదా ?" అంటూ ఎత్తిపొడిచాడు.

ఊఁహుఁ ! ఏం జెయ్యను ?

పట్టణం ప్రవాసమై పోయింది నాకు. ఇది ఆప్యాయంగా నాతో మాట్లాడదు. స్వార్థం ఇది. పట్టణంలో ఉన్నన్ని గొడలు మా పల్లెలో లేవు. ఏమో ఏమై తే నేం ? నేను మాత్రం ఇక్కడ ప్రవాసినైపోయాను. విజనస్థలం అనిపించేటంత జనాభా ఉంది ఇక్కడ. అక్కడ మనిషికీ మనిషికీ, మనిషికీ చెట్టుకీ పిట్టకీ చేనుకీ గట్టిచుట్టరికం ఉంది." అని మా ఊరును వర్ణించడం మొదలు పెట్టాను ఇలాగ –

మా ఊరు వెళ్ళి పోతాను, వెంటనే వెడతా.

వెళ్ళి అక్కడ చక్కని, చల్లని, ఇల్లు కడతా. పూరిల్లు. ఇంటి చూరులంట శాంతీ చల్లదనమూ ఎప్పుడూ నా మీదకి జారుతూ ఉంటాయి.

మా ఊరికి ఉత్తరాన ఒకచెరువుంది. దక్షిణాన కూడా ఒక చెరువుంది. గాలి ఊదినప్పుడూ, మీలు ఎగిరినప్పుడూ, నీళ్లు గలగలమంటాయి. అప్పుడు చెరువు నిద్దరలోనుంచి ఒళ్ళు

విరుచుకున్నట్టనిపిస్తుంది.

ఆ చెరువు గట్టున ఉంటుంది మా ఇల్లు.

మా యింటి వెనకాలే వెలమదొరల దివాణం ఉంటుంది, నల్లని ఎత్తైన పేద్ద రాతిగోడలతో. ఒక గోడ బీటవేసి దానిలో నుంచి రావిమొలక లేచి నిలబడి ఉంటుంది. ఆ రావి మొలకను చూస్తే దిగులు వేస్తుంది, పెరిగి పెరిగి గోడను బద్దలు చేసి పడగొడుతుందేమో అని.

ఇందుమతి చనిపోయాక అజమహారాజు హృదయాన్ని ఛేదించే శోకశంకువును సౌధతలాన్ని భేదించేరావి మొలకతోనే పోలుస్తాడు కాళిదాసు.

ఆ దివాణపు గోడలలోనుంచి ఒక్కొక్కవేళ రాణివాసపు నిట్టూర్పులు విన్నట్టూ, వేరొక్కసారి వెలమవీరుల హుంకారాలు విన్నట్టూ అనిపిస్తుంది.

ఎప్పుడైనా హజారం దగ్గర దొరగారు కనబడతారు. ఆయన ఆరడుగుల ఎత్తు. విరిచి వెనక్కు కట్టిన జరీ అంచుపంచ, దక్కిణీ తరహా పాగా, బుగ్గ మీసమూ, అంగరఖా, "కట్టెర్ర సెరలదీర్ఘవిలోచనములూ," నుదిటిపై పెద్దనామాలూ, వీటితో ఏబొబ్బిలియుద్ధవీరులో అనిపిస్తారు ఆయన.

దివాణానికి ఎదురుగా రావిచెట్టు ఉంటుంది. ఆ పక్కనే రామకోవెల.

రావిచెట్టు క్రింద పెద్ద అరుగు ఉంటుంది. ఆ అరుగు ఎప్పుడూ ఖాళీగా ఉండదు. ఎవరో నలుగురు దానిమీద కూర్చుని, ఊసులాడుకుంటూనే ఉంటారు. ఇద్దరు కన్నుమూసుకుని ఉంటారు.

ఆ రోజులలో మా ఊరే అరమోడ్పుకన్నులాగా ఉండేది, మహాశాంతంగా, మేలుకుని కలలు కంటున్నట్టు.

మా ఊరిని గురించీ మా ఊరిలో జనాన్ని గురించీ రావి చెట్టుకి తెలియని సంగతే లేదు. ఊళ్ళో అందరి ఊసులూ వింటుంది. కలహాల కబుర్లు వింటుంది. పంచాయితీ తీర్పులు వింటుంది. రాత్రిళ్ళు రామాయణం పురాణం వింటుంది. అందుకనే మా ఊళ్ళో ఒక

సహజకవి అన్నాడు,

'రామశాస్త్రి భారతం పు
రాణం చెపుతుంటే,
రావిచెట్టు ఊ కొట్టు,
రంగయ గురుపెట్టు." అని.

పురాణం అంటే జ్ఞాపకం వచ్చింది. రాత్రి తొమ్మిది గంటలు అయాక మా ఊళ్ళో పురాణపఠనం ప్రారంభం, మా ఇంటిముందు ఖాళీ స్థలంలో. ఇటు రామశాస్త్రిగారు కూర్చుంటారు, ముందు వ్యాస పీఠంతో దానిమీద పెద్ద పంచాంగం సాటి పాతకాలపు భారతం. పక్కన ఆముదం పోసిన ప్రమిదతో సెమ్మా.

నిజానికి శాస్త్రిగారికి పుస్తకం అక్కరలేదు. భారతం కంఠస్థం.

ఎదురుగా చీకటిలో ముదుక దుప్పటులు కప్పుకునీ, ముసుగులు వేసుకునీ, నీడలలాగ గ్రామవాసులు. పైన విశాలాకాశంలో ధగధగ మెరిసే నక్షత్రాలు, చచ్చి స్వర్గాన ఉన్న భారత వీరుల్లాగ, ఈ లోకాన్ని కనిపెట్టేవాళ్ళ చూపుల్లాగ. ఎదురుగా కూర్చున్న శ్రోతలనుంచి కూడా అక్కడా అక్కడా చుక్కవంటిచుట్టనిప్పు కనబడుతుంటుంది. ఆచీకట్లో శాస్త్రిగారి గొంతు ద్వాపరయుగంనుంచి వస్తుంది. ఆయన కంఠరవ పక్షాల మీద శ్రోతలమనస్సులు ఆదికాలాలదాకా ప్రయాణం చేస్తాయి.

పగలు మనకళ్ళు కనబడినంత మేరే చూస్తాయి. రాత్రి రామాయణం దాకా చూస్తాయి.

ఆముదం దీపం కూడా పురాణం ఆలకించడం నే నెరుగుదును. ఆలకించి అటూ ఇటూ తల ఊపుతుంది.

మా గ్రామవాసుల్లో రామాయణ భారత కథలు తెలియనివాళ్ళు లేరు. ఎందరకో భారతంలోనివి వందల కొలది పద్యాలు వచ్చు. అయితే, వాళ్ళు అక్షరాస్యులు మాత్రం కారు.

అయినా మహర్షులు వ్రాసిన గాథలు వినివిని, మా గ్రామవాసులు భూలోకంనుంచి పరమపదం దాకా నిత్యమూ రాకపోకలకై నిచ్చెన

కట్టుకున్నారు. ఆ సంస్కృతి ఆవరణలో వాళ్ళది ఒకే ఒక సంసారం. కనుక జాతి అంటూ, ధనమంటూ, చదువంటూ తేడాలు లేకుండా, "మా(వా.అన్నా పిన్నీ.వొదినా"అయిపోయి అందరూ కలిసి ఉండేవాళ్ళం.

రామశాస్త్రి పురాణం చెపుతుంటే నిద్రపోయే రంగయ్యకాపు నాకు బావ. ఎంత నిద్రపోయినా, అతనికీ వచ్చును భారతంలో పద్యాలు.

మా ఇంటి పక్కనున్న మాదన్న పద్మసాలి. చెంతనే ఉన్న మామిడిగుబురులోని కోయిల కన్నా, మలయానిలం కన్నా, ముందుగా రాట్నాన్ని లేపేవాడు అది జుమ్మని తిరుగుతూంటే, వీధి కొకపక్కన, వీధినిలువున పడుగుపేకలు పన్నేది అతని పెండ్లాం.

కొంతదూరాన మా కావయ్యమేస్టారుగారి బడి.

మా గురువు గారిని గూర్చి, బడిని గూర్చి మరొకసారి బాగా జ్ఞాపకం తెచ్చుకుని చెపుతాను. ఇవి మాత్రం కొట్టవచ్చినట్లు ముందుకు తోసుకుని వస్తున్నాయి. కనుక చెపుతాను - ముక్కు కొసదాకా జారిన కళ్ళజోడూ, ఏడాది పొడుగునా తొడుగుకునే కోటున్నూ.

కొందరు పిల్లలు "రావిచెట్టుమీద చిలకోయ్, కా(వయ్యమేస్టరు పిలకోయ్ " అని పాడేవారు. వాళ్ళకి కూడా ఆయనంటే భయమూ, ఇష్టమూను. నాకు మానాన్నగారి మీద ఉన్నంత ఇష్టమూ, భయమూ ఆయన అంటే.

ఆ బడి పక్కనే శ్రీరాములు అంగడి. అంగడిని మా వైపు కొట్టు అంటారు. నల్లగా, పెద్దనామాలూ అతనూ వెంకటేశ్వరస్వామిలాగ ఉండేవాడు కొమ్ములతోటిఉన్న చెట్టు సెమ్మా చుట్టూ రామభజన నడపడంలో శ్రీరాములు దిట్ట.

జియ్యన్న మరీని; జియ్యన్న భక్తుడు. నిజంగా భక్తుడు. అతనికి పూర్వగాథలలో పూర్తిగా నమ్మకం. అతనివంటి వాడే నయం అనిపిస్తుంటుంది నాకు అప్పుడప్పుడు.

నమ్మకపోతే పూర్తిగా నమ్మగూడదు. నమ్మితే సందేహించకుండా,

పదితలలరావణాసురుణ్ణో వేయిచేతుల కార్తవీర్యుణ్ణో పడగొట్టడానికి అవతరించిన పరమాత్ముని గాథలన్నీ నమ్మాలి. అలాగ పట్టుకుని నమ్మేవాళ్ళకి గట్టిగా పడతాయి అడుగులు యాత్రామార్గం మీద.

మాది కవిపండిత కుటుంబం, ఎన్నితరాలనుంచో.

మా ఊళ్ళో కూచిమంచి తిమ్మకవి సార్వభౌములు కూడా కాపురం ఉండేవారు, వారి కడపటి రోజుల్లో. గ్రామానకు తూర్పున పెద్దమట్టిగోడలతో ఆవరణ కనబడుతుంది. దానిలో ఉండేదేమో వారివీడు. ఆ పడిపోతున్న గోడల సందులలోనుంచి జిల్లేడు పొదలూ అవీ కనబడుతూ ఉంటాయి. నా కట్టువైపు వెళ్ళడం కొంచెం బెదురు.

అవి దాటగానే వరి పొలాలు. ఒకచోట పొలానికీ పొలానికి నడుమ, సరిహద్దుగట్టుమీద, పెద్ద తాటిచెట్ల వరస తీర్చివేసినట్లు !

గాలిలో తాటాకుల మర్మ ౦ం ఎంత బాగుంటుంది ! గాలి వేళ్ళు తగిలి పరవశమై తాటిచెట్టు తలూపుతూ ఎంత రక్తిగా కథ చెపుతుంది!

నే ననుకునే వాణ్ణి, ఆ తాళవనం మా ఊరి వెలమ దివాణం వారి పాతకథలు చెపుతుందని. తరువాత తెలుసుకున్నాను, మరొక కవిగూడా విన్నాడని, "పాటలాధరి చెట్ల చేమలకై పాడుతుంటే, తాళవనమున ఆగి చంద్రుడు తాను చెవి ఒగ్గడం."

ఆ తాటితోట చెప్పినట్టే, ఎత్తుగా ఉన్న దివాణపు స్తంభాలమీది విటంకాలనుంచి పావురాలూ చెప్తాయి.

పావురపు కువకువను అరమోడ్పు కన్నులతో వినాలి. అది చల్లగానూ ఉంటుంది. అంతరంగాన్నిఆవంత కదుపుతూనూఉంటుంద.

అక్కడ, ఆ తాటి తెరువు పక్కన, గట్టున కూర్చుంటే ఆకుల రవళీ, ధూరాన ఓ చెట్టు కింద రెండు మూడు దూడల్ని కాస్తూ పుట్టగోచీ పాగాతో గొల్లపిల్లవాడూ, నడుమనడుమ వాని పాటా, ఆవుదో దూడదో అంభారవమూ, చిటుక్కున చెట్టుకొమ్మమీదినుంచి వడ్రంగిపిట్ట టక్కుటక్కుమని కొట్టే చప్పుడూ, తుర్రున ఎందుకో ఎగిరే పాలపిట్ట రెక్క నీలిచాలూ, హఠాత్తుగా దూకిదూకి అడ్డుగా పరుగెత్తే లేగదూడా,

అప్పుడూ ఇప్పుడూ దూరంనుంచీ దగ్గరనుంచీ ఒక పాలికేకా, నూర్పు లదో కోతలదో సందడీ, గాలి రెక్కల మీద అడపా తడపా వచ్చే గ్రామకలకలమూ, గట్లనూ పుట్లనూ దాటి గంతులేస్తూ పోయే గూడులేని బండీయెద్ల మెడగంటల సవ్వడీ, చక్రపుటిరుసుల కిరకిరా, – ఆరుకాలాలూ కాలాలకనుకూలంగా వీటి అన్నిటిలోనూ మార్పులు, చేనూ తోటా చెరువూ పల్లే ప్రజాకలిసి, ఒకరినొకరు తెలిసీ, బతకడమూ, ఎంత బాగుండేది, ఎలా ఉండేది మా ఊరు !

మా ఊరు పక్కనే మరీ పెద్ద ఊరు ఉండేది – దానిని పట్టణం అనవచ్చేమో ! అది మా రాజుగారిది.

అక్కడికి రోజూ వెళ్ళేవాణ్ణి నా తండ్రితో పెత్తండ్రితో. ఎలాగ? ఒక్కొక్కప్పుడు చెరువు ఒడ్డునా, పొలంగట్లా, పుంతలా, మలుపులా, బడి నడిచివెళ్ళేవాళ్ళం.

రెండు మైళ్ళ దవ్వు కాశీ అంత దూరంగా అప్పుడు ఉండేది. అయినా బాగుండేది.

ఒకొక్కప్పుడు నేను రంగయ్య కావుమూవుమీద కూర్చుండేవాణ్ణి.నేనంటే అతనికి గారాం. చెప్పానుగా, అతన్ని బావ అనేవాణ్ణని. అలా నడిచి వెడుతుంటే, మా నాన్నగారో బాబయ్యో నాకు అమరం చెప్పేవారు, రఘు వంశమున్నూ.

ఇంతలో, దూరాన్నుంచి, దక్షిణకాశీ అయిన ఆ పట్టణం పరిసరాల ఉద్యానవనాల్లోనుంచి, 'మేము ఉన్నాం నీ కేమి భయం లే' దన్నట్టు పరమశివునిదిన్నీ, మాధవ దేవునిదిన్నీ, ఆలయ గోపుర విమానాలు ఠీవిగా ఆకాశంలోకి పొడుచుకుని కనబడేవి.

అప్పుడు నా కనిపించేదీ, ఆ పట్టణం యావత్తూ ఉభయ సంధ్యాసమయాల్లో కోవెలవైపు తిరిగేదనిన్నీ, పగలల్లా మహారాజ మందిరంవైపు తిరిగిఉండేదనిన్నీ.

ఎవరో అన్నారీమధ్య. 'ఇప్పుడాపట్టణం కోటవైపుగాని కోవెల వైపు గాని మొగం తిప్పడం లేదు. వాటివైపు వీపు తిప్పి పంచదార ఫేక్టరీ

వైపు తిరిగి చూస్తుం' దని; నేను విని పించుకోలేదు ఆ మాటలు !

ఇలాగ మా ఊరిని గురించి నా నేస్తంతో చెప్పుకుంటూ పోతుంటే, ఎన్నో స్మృతులు దొంతర దొంతరులుగా మనస్సు లోనికి తోసుకుంటూ వచ్చాయి.

కొన్ని స్మృతులు దిగులు కలిగిస్తాయి. మనస్సులోకి వచ్చి, మునిమాపు చీకట్లో మందిరంలోనికి వచ్చే గబ్బిలాల్లాగ. మరికొన్ని ఉదయాన్నే ఇంటి కిటికీలోనుంచి లోనికి చొరబడి గిలిగింతలు పెట్టో, ఒళ్ళు నిమిరో, లేపే సూర్యకిరణంలాగ, గాలి కెరటంలాగ ఉంటాయి. కొన్ని అడపా తడపా పెళ్ళి పందిట్లో అత్తరు వాసనలాగ తగుల్తాయి. వేరొక కొన్ని క్రేవనే ఉన్న ఇల్లాలి కుంతలాలనుంచి తటాలున సాంబ్రాణి వాసనలాగ స్ఫురిస్తాయి. కొన్ని వేసంగి సందెలో మల్లె తావి లాగ పులుగుకూతలాగ హాయి అనిపిస్తాయి.

నా మిత్రునితో నా గ్రామ విశేషాలను గురించి చెపుతుంటే ఇన్ని రకాల స్మృతులు ఎన్నెన్నో నా లోపల అలముకొన్నాయి.

మరి ఆ హాయిలో, ఆ ఆవేశంలో మా గ్రామానికి బయలుదేరి వెళ్ళాను.

"చంద్రంపాలేనికి త్రోవ ఇదేనా ?"

అవును ఈ రోడ్డక్కడికే పోతుంది. ఈ బస్సుకూడా అక్కడికే. అదుగో దూరాన ఆ టూరింగు సినిమాడేరా !"

త్వరగా ఊళ్ళోకి నడిచి వెళ్ళాను.

అక్కడ నా చంద్రంపాలెం లేదు.

మా ఊరు పోయింది !

* * *

# మా ఊళ్ళో వీధి అరుగు

పట్టణంలో ఉన్నప్పుడు పల్లెటూరికి పోయి ఉండాలనిపిస్తుంది. తీరా, పల్లెటూళ్ళో పట్టుమని పదిరోజులైనా ఉండలేను.

చాలా వింతగా తయారయ్యాను నేను. ఆలోచనలకీ, కోరికలకీ, బుద్ధికీ, నడవడికీ, దేనికీ, ఒకదానికొకటి సంబంధం లేదు ; పొత్తు లేదు.

స్ఫుటమైన మూర్తి ఒకటి నా కింకా ఏర్పడినట్లు లేదు.

ఈ రోజుల్లో అందరూ నాలాగే ఉన్నా రనిపిస్తుంది ఒకప్పుడు – ఎటూ తేల్చుకోలేక, ఎక్కడికీ పోలేక.

అసలు పల్లెటూరికే మతిపోయినట్లుంది ఇప్పుడు. ఇదివరకు ఎలా గుండేది. పాపం, నిశ్చలంగా నిశ్చింతగా!

"కాలవ ఒడ్డున ఒరిగి నీడ చూసుకునేదో,
చేలనడుమ పడుచులాగ చేయెత్తి పిలిచేదో,
తోటవెనుక కాస్త కాస్త తొంగి తొంగి చూసేదో,
కొండపక్క నిలిచేదో, "
ఎంత తీయగా, చల్లగా ఉండేది
తెలుగు పల్లె !

ఇప్పుడు పల్లె కూడా మతి చెడగొట్టుకుంది – అనవసరంగా పట్టణం లాగ ఉండబోయి, అది చాతకాక.

నేనూ పల్లె ఒకలాగే ఉన్నాం.

కాఫీ హోటళ్ళూ, వాటినుంచి గ్రామఫోనురికార్డుల అరుపులూ. కిళ్లీసోడాకొట్టులూ, బస్సుల సందడీ, సినీమాలూ, వాటి తాలూకు ప్రకటనలూ – వాటి అన్నిటితో గ్రామం వేడుక కోసం నగరం వైపు మొగం తిప్పుకొని చూస్తున్నట్టుంటుంది. నగరం వీటి అన్నిటిమధ్యా ఊపిరాడక నలుగుతూ, అన్నం కోసం పల్లెవైపు చేతులు జాపుతున్నట్టుంటుంది.

పల్లి తల్లి వంటిది. పట్టణం ప్రియురాలు వంటిది.

అన్నం పెట్టడం, చల్లని అంకం మీద పవళింప జేసుకోవడం – గారాంగా పెంచుతుంది పల్లె.

ఆకర్షించడం, ఎప్పటి కప్పుడు ఆవేశాలతో కదిలించి వేయడం గాఢంగా ఊపేస్తుంది పట్టణం.

"నీ కేం గావాలి ?" అంటుంది పల్లె, "నా కేమిస్తావు?" అంటుంది పట్టణం.

అంతేగాదు. పల్లె కుటుంబంలాగ, సంసారంలాగ ఉంటుంది. పట్టణం సంతలాగ విపణిలాగ ఉంటుంది.

గ్రామంలో కాలాలు తెలిసిపోతాయి – ఎండా, వానా, వెన్నెలా, వీటితో స్పష్టంగా. పట్టణానికి ఋతువులు లేవు; అందువల్ల, పట్టణంలో ఉన్న చెట్లూ, చేమలూ, లతలూ, పువ్వులూ, పక్షులూ, బిక్కచచ్చి ఉంటాయి, దిగులుగా ప్రవాసంలో ఉన్నట్టు.

పట్టణంలో పదిమందిలో ఒంటిరిగా ఉంటాం. పల్లెలో మనిషీ చెట్టూ, చేమా, పిట్టా, జంతువూ కలిసి ఒకే ఒక కుటుంబం.

ఈ సందర్భంలో నా కొకటి వింతగా కనబడుతుంది, ఇళ్ళల్లోనూ, ఇళ్ళు కట్టడంలోనూ.

పట్టణాల్లో కొత్తరకపు ఇళ్ళు లేస్తున్నాయి. ఇవి దాదాపు ఒకే రకంగా ఉంటాయి.

కొన్నింటికి చుట్టూ గోడలు ఉంటాయి, లోపలికి రావడానికి వీలులేదన్నట్టు. ఎన్నిటికో గోడలు లేకపోయినా వీధి అరుగులుండవు.

ఇలాంటి ఇళ్ళు గ్రామాల్లోకి చొరబడుతున్నాయి యిప్పుడు. ఈ ఇళ్ళు ధుమధుమలాడుతూ, మొహం చిట్లించుకొని, వీధివైపు వీపుత్రిప్పినట్లుంటాయి.

గ్రామాల్లో ఇళ్ళకు వీధి అరుగులుండేవి. పెద్దవాళ్ళ ఇంటికి మరీ పెద్దఅరుగులుండేవి.

వీధి అరుగు ఆహ్వానం వంటిది. మొదటి ఆతిధ్యం వీధి అరుగే ఇస్తుంది. అతిధులో, అభ్యాగతులో, బాటసారులో, అందరినీ ఇలా దయచేయండి అంటుంది వీధి అరుగు.

వీధి అరుగు స్వాగత వచనం వంటిది.

గ్రామంలో వీధి అరుగు గొప్ప సంస్థ.

ఇంటికి తగిన అరుగు ఉండేది మునుపు. ఇప్పుడు అరుగు హరించుకు పోతూ ఉంది క్రమంగా.

మా ఊళ్ళో చెప్పుకోదగ్గ అరుగులు నాలుగు ఉండేవి - కరణం జగ్గరాజు మావయ్యగారిదీ, మునసబు శేషాద్రిగారిదీ, దివాణందీ అంటే వెలమ దొరగారు వెంకట్రాయణిం గారిదీ, మరీ మాదీ అంటే పెద్ద శాస్త్రులు గారిదీని.

ఇవే, సమయాన్నిబట్టి, చేరిన జనాన్నిబట్టి, కచేరీ లయ్యేవి; క్లబ్బులయ్యేవి; సభాస్థలాలయ్యేవి.

కరణంగారి వీధి అరుగూ, రాయణింగారి వీధి అరుగూ గచ్చువీ, పెద్దవీ.

రాయణింగారి అరుగు గచ్చు నిగనిగమంటూ నున్నగా మెరుస్తూ ఉండేది. అరుగంటే నిజానికి రెండు అరుగులు–వీధి గుమ్మానికి అటూ ఇటూ. దివాణపు టరుగుల మీద తివాసీలు పరచి ఉండేవి. కాని, చల్లటి గచ్చుమీదే కూర్చోవాలని ఉండేది మాకు. ఈ అరుగుల మీద ఇటూ అటూ జేరగిలబడ్డానికి, గచ్చు బాలీసులుండేవి. అరుగుల మీద ఒకవైపు రెండు సవారీ లుండేవి - చక్కగా చెక్కిన అడ్డలూ, సోగదండెలూ,

దంతపుకోళ్ళూ, రాయంచరెక్కలతో పరుపు బాలీసులూ, "వింతపని చక్కల్ పెంజరీ పింజరీల్", మొదలైన వాటితోనూ.

పెద్దలు మాట్లాడుకుంటూంటే పిల్లలం ఆ సవారీలో సరదాగా కూర్చునేవాళ్ళం.

ఆ అరుగుల మీద ఉన్న కిటికీలలో నుంచి దివాణం లోపలి భాగం కనబడేది.

నగిషీ పనుల మించు నిగనిగజిగిగుల్క
కంబముల్ దూలముల్ గలిగి, వింత
సంతన దగు చాకచక్యంబు పల్కల
జిగిసరంబీ క్రింద జిల్గుమేల్ క
లంకారి చాందినీ, లాంతరుల్ వెలుగ, ము
క్తాచూర్ణ పరిలిప్త ధాగధగ్య
భిత్తి భాగాది శోభిత గోపగోపికా
బహుళకేళీ చిత్రపటము లమర,
తళుకు లిల జిల్క నిల్వుటద్దముల గములు
మరి, హ మీరు ఘనం బైన ఘరుము గల్గి"-

అద్భుతంగా మరోలోకపు ప్రాసాదాన్ని తలపించేది. దీనిని గూర్చి మరోసారి.

రాయణింగారి లోగిటి వీధి అరుగు మా ఊళ్ళో క్లబ్బు వంటిది. దీనికి గూడా రాయణింగారికి లాగే ప్రాభవమూ బడాయీ ఎక్కువ. ఇక్కడ అందరూ అన్ని పనులమీదా, చేరగూడదు, వీల్లేదు. పెద్ద చందా లిచ్చే సభ్యత్వం లేకపోయినా ఊళ్ళో కొందరు పెద్దలే ఇక్కడ చేరేవారు. ఆ చేరడమున్నూ సాయంకాలాలే.

ఇక్కడ కాస్త కరణం మునసబుల వీధి అరుగులను గూర్చి నాలుగు మాటలు చెపుతా.

అవి కచేరీలు.

కరణం గారి వీధిఅరుగుమీద పాత తివాసీ ఉండేది – కొంత నలిగి, ఎంతో రంగు పోగొట్టుకొన్నది.

ఒక పక్కన గోడ నానుకుని ఆయన కూర్చుంటే ముందుగా చిన్న డెస్కు బల్ల ఉండేది.

కరణం జగ్గరాజు మామయ్యగారి కచేరీ వేషం మహా బడాయిగా ఉండేది – "తెలి తలపాగ, చొక్కా, మొలతిత్తి, బుజంబున చల్వపచ్చడంబు, అలచిటిెవేల ముద్రిక, ఒయారము మీర పొగాకు చుట్ట, సొం పలరెడు కావిదోవతి, పదాబ్జ యుగంబున ముచ్చెలున్నూ." ఇవి గాక కళ్ళజోడు ఉండేది. అది ఒకప్పుడు నుదుటిపై కెక్కేది, ఆయన తీవిగా పరిశీలించే టప్పుడు. అది మరొక్కప్పుడు ముక్కు కొసకు జారేది, ఆయన సూటిగా పరీక్షించేటప్పుడు.

మునసబు శేషాద్రిగారి వీధి అరుగు గచ్చుకన్నా కూడా నిగనిగ లాడుతూ గట్టిగా నున్నగా ఉండేది – మట్టితో అలికిన దైనా ! ఈ అరుగు మొగాన జేవురు మట్టిచార లుండేవి. దీని మీద పెద్దపెద్ద తుంగ చాపలు. ఆ చాపల కొకమూల తుంగలు తుంచి ఉండేవి- వచ్చిన వాళ్ళు తోచక పెరకడంవల్లో, పళ్ళు కుట్టుకుందుకో నమలడానికో పీకడం వల్లో!

మునసబు అరుగుమీద కూడా ఒకసవారి ఉండేది.

పెద్ద పట్టెనామాలూ, ఎర్రచారల నిడుపాటి కళ్ళూ, కోటేసిన గరుడముక్కూ, ముందు ముళ్ళుగట్టుకునే అంగరఖా, తలవెనుక పై భాగానికి లాగి గోపురంలాగా కట్టిన జుట్టుముడీ, వెండిపొన్ను పెద్దకర్రా వీటితో మా మునసబు అంత శ్రీవైన విగ్రహాన్ని నేను దరిమిలాని, చూడ లేదు.

కరణంగారి వీధి అరుగూ, మునసబు వీధిఅరుగూ కచేరీలు అన్నాను గదూ!

అవి సాయంకాలం దాకా సందడిగా ఉండేవి. ముఖ్యంగా కరణంగారి వీధిఅరుగు. కిస్తీలూ, జప్తులూ, మందడిగోడల ఫిర్యాదులూ, బందెలదొడ్లూ, చేలగట్ల వివాదాలూ, సర్వేరాళ్ళూ, రెవిన్యూ ఇనస్పెక్టర్ల దురంతాలు, తాసిల్దారు గారికి సప్లయిలూ, బోర్డు ఎన్నికలూ, రౌడీ సుబ్బన్న పోకిరీ చేష్టలూ, అన్నదమ్ముల ఆస్తి పంపకాల తాలూకు వివాదాలూ, అచ్చెమ్మ విడాకులూ, పట్టణంలో కోర్టు సాక్ష్యాలకు తయారీలు - ఇలాటి వాటిమీద కరణం మునసబుల మంత్రాంగాలూ, చర్చలూ, నిర్ణయాలూ తీర్పులూ, ఈ అరుగుల మీద జరిగేవి.

ఇక్కడికి అన్ని తరగతులవారూ వచ్చేవారు. వచ్చి తాహతును బట్టి కొందరు పైన అక్కడా అక్కడా కూర్చునే వారు. పాగాలవారూ, జుట్టు ముళ్ళవారూ, జనపాలవారూ, బొత్తాలు లేని చొక్కాలవారూ, దిసమొండెములవారూ, పెద్దలూ, పిన్నలూ, రకరకాలు!

కొందరు అరుగుమీద కూర్చుందుకు తాహతు లేనివారు, కింద నిలబడి తమగోడు చెప్పుకొనేవారు.

మరికొందరు, అరుగుమీద వేంచేయడానికి తమకే అవసరమూ లేదన్నట్లు నిర్లక్ష్యంగా క్రింద నిలబడి, ఒక చంక కింద పొన్నుగర్ర నిలబెట్టి, రవంత ఆ పక్కకు ఒరిగి, లంకాకుచుట్ట కాలుస్తూ ఉండడం వల్ల నడుమ నడుమ తుపుక్కున ఉమ్మేస్తూ, అరుగువైపు చూడకుండానే అక్కడ జరిగే వ్యవహారాల్లో కలుగజేసుకొంటూ ఉండేవారు.

కొందరు స్త్రీలు తమగొడవ చెప్పుకోవలసి వచ్చి, అరుగు పక్కచాటుగా, ఒదిగి నిలబడి ఉండేవారు.

దూరాన అరుగుమీద ఓమూల ఒక పరదేశి మూటతో కూర్చుని ఉంటాడు.

ఈ వ్యవహారాల తీర్పులో నడుమ నడుమ ఎవరో ఒకరు ఛలోక్తులు విసరుతారు.

ఒకడనవసరంగా కలుగజేసుకొని చీవాట్లు తింటాడు.

పనిలేకుండా వచ్చినవాళ్లు అక్కడక్కడ కూర్చుని ఇద్దరు ముగ్గురు తమ తమ తీర్పులు కూడా ఇస్తుంటారు.

సాయంకాలం మూడుగంటల నుండి దివాణపు వీధి అరుగు. ఇక్కడికి కరణం మునసబులు వస్తారు; కలకాపులు వస్తారు; మేష్టారు వస్తారు; సిద్ధాంతీ షావుకారూ కూడా వస్తారు; శాస్తుల్లుగారు వస్తారు. రాయణింగారు సరేసరి.

వీరందరు అరుగుమీద సభ తీర్చినప్పుడు, ఆ వీధివెంట నిరాఘాటంగా అందరూ వెళ్ళడానికి జంకేవారు - మా ఊరిలో ఉన్న పెద్ద ఆబోతు తప్ప!

దాని దర్జాయే వేరు. పెద్దనూపురం ఆదీ, వెండి కొండలా కదలివస్తూ, ముందు పెద్దరంకె వేసి, దివాణపు టరుగును రాసుకుంటూ వచ్చి, మధ్య మెట్లమీద మునికాళ్ళు పెట్టి నిలబడేది. తక్షణం దొరగారు నౌకరువైపు చూసేవారు. వాడు పోయి చాటెడు బియ్యం పోసి తెచ్చి దానికి పెట్టే వాడు.

ఇంతలో ఆ వీధినే తుర్రుమని ఒక పంది అటు పరుగెత్తేది; చెంగున ఇటు ఒక లేగదూడ బంతిలా ఎగిరి వెళ్ళిపోయేది.

ఊరి బావినుండి నీళ్ళు తెస్తున్న అమ్మలక్కలు, అంతవరకూ కిలకిల మాట్లాడేవాళ్లు, ఒక్కసారి ఆగిపోయి, నిశ్శబ్దంగా తలలు రెండోవైపు తిప్పుకొని, నడిచిపోయేవారు. వాళ్ళ అందెల రవళిలో రవ్వంత వడిదుడుకూ, వాళ్ళ కడవల నీళ్లలో రవ్వంత తొట్రుపాటూ, వాళ్ళ మనస్సులు దివాణపు టరుగుమీదనే ఉన్నాయని తెలియపరుస్తున్నప్పటికీ.

ఇంతలో సీమదేశాల్లో యుద్ధాన్ని గురించో, చంద్ర లోక యాత్రను గురించో, కబుర్లు వస్తాయి. ఎవరికి తోచినట్లు వారు

మాట్లాడుతారు. వెటకారంగా చిరునవ్వుతూ కరణంగారు ఆఖరిమాట చెప్పడానికి చూస్తూ ఉంటారు. తమపూర్వులైన వీరుల్లో ఒకరుంటే చాలు, ఈ యుద్ధాలు చిటికెలో తేలిపోయేవని దొరగారు చెప్తారు. కాలికి పసరు పూసుకొని హిమాలయాలకిన్నీ, ఇట్టే చేతులు జాపి కాళ్ళెత్తి చంద్ర గోళానికిన్నీ, మన పూర్వులు చటుక్కున వెళ్ళి, మళ్ళీ సాయంకాలానికి ఎలా తిరిగివచ్చేసేవారో సిద్ధాంతిగారు విశదంగా తెలియబరుస్తారు.

రెండో అరుగుమీద పేకాట జరుగుతూ ఉంటుంది.

ఒక్కొక్కప్పుడు వీధి అరుగులముందు, తూర్పు నుంచి రాజుగారు పంపిన పుంజుకీ, రాయణింగారి పుంజుకీ, పోట్లాట జరుగుతుంటే, అందరూ చూస్తారు. కౌజుపిట్టలది కూడా. దొరగారు, కౌజుల్నీ, పుంజుల్నీ నాణెం గట్టడంలో గొప్పవారు. వీటి పోట్లాటల సమయంలో మాత్రం గ్రామంలో చాలామంది వీధిలో మూగుతారు. కొందరు పిల్లలు చొరవ చేసి దివాణపు మెట్లు ఎక్కి, అరుగుల మీదకి రాబోతుంటే, పెద్దలు వాళ్ళను తరిమేస్తారు.

రాత్రి శాస్త్రిగారి వీధిఅరుగు. దానిముందు ఖాళీ స్థలంలో జరిగే పురాణపఠనం సంగతి మరోసారి.

ఇలాగ కరణం మునసబుల వీధి అరుగులు గ్రామస్థుల నిత్యలౌకిక జీవితానికీ, దివాణం వీధి అరుగు వేడుకలకీ కాలక్షేపానికీ, శాస్త్రిగారి వీధి అరుగు ధర్మచింతనకీ ఆముష్మిక గోష్ఠికీ కేంద్రాలై ఉండేవి.

కాక కుట్టుపని దానయ్య అరుగుండేది. దానిమీద మిషన్ టకటక లాడిస్తూ ఉండేవాడు.

సిద్ధాంతిగారి చిన్న అరుగుండేది. ఇక్కడ ఆయనచేత చెవిటి సుబ్బయ్య–వినిపించకపోయినా–న్యూస్‌పేపర్ చదివించుకొనేవాడు.

ఇలాగే ప్రసిద్ధమైన అరుగులు కొన్ని ఉండేవి.

అయితే ఈ మధ్య వీధుల్ని వెడల్పు చెయ్యడంలో అరుగులు కొన్ని కుదించుకుపోయాయి.

కొన్ని అరుగులు గదులైపోయాయి. సిద్ధాంతిగారి వీధిఅరుగు అటువంటిది. దానిలోకి వచ్చింది దానయ్య కుట్టుమిషన్.

కాని కాలం వచ్చి రాయణింగారు చితికి పోవడం వల్ల వారు దూరాలకు వలసపోవడమున్నూ, తరువాత కుమారుని ఉద్యోగాన్నికై పట్టణవాసమేర్పరచుకోవడమున్నూ, దివాణపులోగిలి లోపలకూలి దిగబడిపోయి అరుగుల మీద అందంగా చెక్కిన స్తంభాలు మాత్రం మిగిలిపోయాయి. ఇప్పుడు ఆదారిన ఆబోతే కాక అందరూ ధాటీగా మాట్లాడుకుంటూ పోతున్నారు.

కరణంగారు వృద్ధులవడం వల్ల, ఇతర కారణాల వల్ల, కుంగిపోయిన గుడారంలాగ అయిపోయి అరుగుమీద చదికిలబడి కూర్చుంటారు. ఇప్పుడు దానిమీద ఆట్టే కచేరీలు జరగడం లేదు.

శాస్త్రిగారు పరమపదించడం వల్ల, వారి కుమారుడు ఇంగ్లీషు చదువుకొని, ఎక్కడికో ఉద్యోగానికి వెళ్ళిపోతే ఆ ఇల్లు బోర్డువారు 'ఎంక్వైరు' చేసి అరుగుల మీద క్లాసుల కోసం గదులు కట్టారు.

మునసబు గారి వీధిఅరుగు ఇంకా సందడిగానే ఉంది. అయితే, అక్కడ ఇప్పుడు ఎన్నికలగోలా పార్టీల కోలాహలమున్నూ.

* * *

# శ్రీ కృష్ణావతార తత్త్వము

శ్రీ కృష్ణుడు ఎవరో నే నెరగను; శ్రీ కృష్ణుణ్ణి ఎరిగి నంత బాగా ఇతర దివ్యమూర్తిని ఎవరినీ నే నెరగను.

శ్రీ కృష్ణుడు ఇచ్చినంత చనవు మరెవ్వరూ నా కివ్వ లేదు; లోపల ఇముడక, శ్రీ కృష్ణుడు దాటిపోయినంత మరేదైవమూ దాటిపో లేదు.

పలుకరించి పరుగెత్తుతాడు; కన్నుగీటి కౌగిటిలోకి రాడు; కలిసికట్టుగా ఉండి గుట్టుమట్లుదొరక నీడు. "ఇటువంటి వానిని ఏమనాలి?", అని అందరికీ అనిపిస్తుంది; యశోదకు, రాధకు, అర్జునుడికి ఇదే గతి పట్టింది !

మరొక అవతారమూర్తిని తీసుకోండి –

నరసింహమూర్తి. హిరణ్యకశిపుణ్ణి చంపి, ప్రహ్లాదుణ్ణి చేపట్టాడు; అంతే.

వామనమూర్తి. బలిని కికురించి ఇంద్రునికి త్రిలోకాధిపత్యం పట్టం గట్టాడు; అంతే.

ఇక శ్రీరామచంద్ర మూర్తి! ఇటువంటి కుమారుడు లేడు; ఇటువంటి భర్త లేడు; ఇట్టి మిత్రుడూ లేడు; ఇట్టి ప్రభువూ లేడు. ఎవరితో ఏలాగున ఉంటాడో, ఎప్పుడు ఏమి చేస్తాడో మనకు స్పష్టం; అప్పుడు ఆయనతో వ్యవహరించిన వారికీ స్పష్టం. అందరికీ భక్తి. అందరికీ గురి. రావణునకు కూడా అంతే! రాముని చేతిలో మరణం అతనికి వరం.

శ్రీరాముడు దైవం. ఆయన అడవులలో తిరిగినప్పుడూ, ఆలికై నిట్టూర్చినప్పుడూ, అనుగుతమ్మునికై ఏడ్చి నప్పుడు కూడా ఆయన దైవమే. మానవు డనిపించడు; నటన అనిపించదు. "ఇతడు అసాధ్యుడూ, మనస్సులో ఏదో ఉన్నదీ" అనిపించదు. మానవునితో వ్యవహరించేటప్పుడే మన కలాగ అనిపిస్తుంది.

మానవుడు ఎలాగ ఉండాలో అది శ్రీరాముడు నిరూపిస్తున్నట్టుంటాడు. మానవుడై ఉన్నట్టే ఉండి, శ్రీకృష్ణుడు మహాకార్యాలు సాధిస్తాడు.

"నీవెవరితో ఏ సంబంధము ఏర్పరచుకున్నా, ఏ స్థితిగతుల్లో ఏ కార్యం చేయవలసివచ్చినా, నీతీ, న్యాయం పాటించి నేను చేసినట్లు చేయవోయ్; అది దైవానుకూల మైన పద్ధతి" అని శ్రీరాముడు అంటాడు.

"నేనేమి చేస్తున్నానో, ఎలాగ చేస్తున్నానో నీకెందుకు? దివ్యపద్ధతి నీకేం తెలుసు? ఫలితం చూసుకో. అది నీకోసమే. లోక కల్యాణం కోసం కూడా" అని శ్రీకృష్ణుడు అంటాడు.

భగవంతుడు రాము డైనప్పుడు లక్ష్య ప్రాయుడైన మానవుడు. భగవంతుడు కృష్ణు డైనప్పుడు పరిపూర్ణ మానవుడు.

ఒక విధంగా చూస్తే శ్రీకృష్ణావతారం పరిపూర్ణమైనది. దీనిలో వైవిధ్యం ఎక్కువ. వివరాలు ఎక్కువ. చైతన్యం ఎక్కువ.

మానవుని జీవితంలో, శైశవం మొదలుకుని సర్వావస్థల్లో, అనేక సంఘటనల్లో, వివిధ సమస్యలూ పరిష్కారం చేయడానికి సమర్థం అనిపిస్తుంది శ్రీ కృష్ణావతారం.

అంతేకాదు, ఈ అవతారంలో భగవల్లీల ఎక్కువగా గోచరిస్తుంది. దివ్య సంకల్పం ఎక్కువ తీవ్రంగా, అమోఘంగా సాక్షాత్కరిస్తుంది.

తండ్రి చనిపోయినప్పుడూ, ప్రియావియోగమప్పుడూ, రాముడు కంట తడిపెడతాడు. పగవాణ్ణి ఎదురైౖ పరశురాముడు భగ్గుమంటాడు. ఆయా సమయాలలో ఆయా కార్యకలాపాలలో భాగస్వాములన్నట్టు, రామాదులు కూడా పాల్గొంటున్నట్టు ఉంటారు.

శ్రీకృష్ణుడు ఎప్పుడూ అంటీ ముట్టనట్టుంటాడు. యశోదస్తన శయ్యమీద, నందుని ఉత్సంగము పైన, గోపికా వలయములో, కాళియఫణాలపై, కంసమర్దనమప్పుడూ, అష్టమహిషుల అంతఃపురాలలో, రాజరాజుల సదస్సులలో, రాయబారాలలో, రణరంగములలో విజయసారథి అయిన వేళ- ఎప్పుడూ కూడా, పెదవులపైనా, కన్నులలోనూ కనబడీ కనబడని చిరునగవుతో శ్రీకృష్ణుడు సాక్షాత్కరిస్తాడు. వీటి అన్నిటిలోనూ తానుకూడా ఉన్నా, ఇవి ఏవీ తనవి కానట్టూ, తనవే అయినా తన కంతా తెలిసీ, తానే సర్వమూ జరిపిస్తున్నట్టూనూ ఉంటాడు.

లీల అన్న మాట శ్రీకృష్ణుడికి చెందినట్లు మరెవ్వరికీ చెందదు.

ఇతనిలో ఉన్న చిక్కే ఇది.

అమ్మపాలు తాగుతూనే ఆవులించి అఖిల విశ్వమూ నోటిలో చూపిస్తాడు. వేలెడంత ఉండడు, వ్రేతల ఇండ్ల వెన్నలు దొంగిలించడమూ వెలదుల రొమ్ములు ఒడిసి పట్టడమూను. గోపాల బాలుడేమిటి గోవర్ధనమెత్తడమేమిటి? మూడు గుక్కలలో గుటుక్కు గుటుక్కుమని దారుణదానవి ప్రాణాలు తాగివేసినవాడు, పగవాడు తరుముకుని వచ్చాడని

పలాయనం చిత్తగించి పారావారమధ్యాన భద్రంగా ఇల్లు కట్టు కుంటాడా? అలాగే భారత యుద్ధమప్పుడు ఒక్కసారి చక్రం చేతపట్టితే సరిపోయేదానికి, భగవంతుడై కూడా ఎన్ని పన్నాగాలు పన్నాడు!

అయిన వాళ్లచేత కానివాళ్లచేత ఎన్ని మాటలు పడ్డాడు! అయితే ఒక్కమాటా పట్టించుకోడు. చోరుడన్నారు. జారుడన్నారు. కపటనటనాపరు డన్నారు; అయితే చిత్రం, అప్పుడు కొందరు ఆగ్రహంతో అన్న ఆ మాటలే ఇప్పుడు అందరూ అమితప్రపత్తితో ఆప్యాయంగా అంటారు.

నే నెరగను శ్రీకృష్ణుడు ఎవరో, ఎట్టివాడో! అయినా నాకు ఏ కృష్ణుడు ఇష్టమా అని ఆలోచించుకుంటున్నాను.

"మన్ను రొంపియు పెండయు మసలువట్టి, పాంసు సంక్రీడ తన మేను భానురముగ", "అనేక ధాతుచ్ఛటా వ్యక్తమైన శైలకుంజరకలభము" లాగ ఉండేవాడనీ, వాని చేతిలో నవనీత కబళము "ఏనిక కొదమకరంబున మానుగ వెలిదమ్మి మొగడమాడ్కి" ఉండేదనీ, "తరుణీ నిర్మథన లగ్న దధి బిందువులతో" వానికి "సురలుతరువగ సుధాశీకరములు మెయిచిలుకునట్టి కల్యాణము" ఒదవే దనీ, ఆ బాలనీల మూర్తి కోసం యశోదలాగే విష్ణు చిత్తలీలాశుకులలాగే, ఎందరో భక్తులూ కవులూ మతి పోగొట్టుకున్నారు.

తరువాత "దేవకీ తర్ణకము" 'మందప్రాయాంధ్ర కూరిమి ప్రమానిపండు" అవుతుంది. వ్రేపల్లె, విభాతవేళ. గొల్ల భామలు చల్లతరచిన సవ్వళ్లూ, ఊరివెలుపల కొలనిగట్టులా బయళులా చెట్టునీడలా నిండు పొదుగుల ఆలకదుపులూ, నిడుద కొమ్ముల ఆబోతులూ, చివ్వకు కాలుదువ్వుకోడెలూ, . చెంగు చెంగున దాటులేగలూ, చద్ది చిక్కాలతో గోపకుమారులూ, వారి నడుమ రామకృష్ణులూ, యమున వైపునా బృందారామం దాపునా విడుదులూ, చద్ది కుడుపులూ, చిట్టిపొట్టి ఆటలూ, చిలిపి చేష్టలూ, అంతలో సాయంకాలమూ, మందలు

ఇంటివైపు మసలిమసలి మరలడమూ, వాడలలో నడయాడు గొల్లపెద్దలూ, వాకిట్లో ఎదురు చూచు వ్రజభామినులూ, అందరిమనసులలో తానై, అందరినోటా తానై, అందరికళ్ల కెదురుగా తానై, ప్రతిగోవుకూ ప్రతివత్సానికీ పల్లెలో ప్రతి ఇంటా ప్రతి ప్రాణికీ తానే ఐన గోవిందుని స్మరణ అంటేనే, గోపికల లాగ, నందునిలాగ, ఉద్ధవునిలాగ ఒడలు మరచిపోయేవారున్నారు.

శరదాగమం, పున్నమివెన్నెల - దూరమై చేరువై వేణుగానమూ ఆ వంశీగానపర్ణాలపై వకుల వాసనా, కాళింది కాలియందెలు మూగవోవడమూ - వేణుగానమూ, వ్రేపల్లె నిద్దురలో ఒళ్లు విరుచుకుని ఒత్తిగిలడమూ, గొల్లల పెరళ్లలో ఆగక గోవులు చిందులాడడమూ- వేణుగానమూ, గొల్లల కౌగిళ్లలో దాగక గుండెలు తొందర పడడమూ, ఇళ్ల తలుపులు తెరచిన చప్పుళ్లూ, వీథుల అడుగుల సవ్వడులూ - దవ్వుల నుండి వేణుగానమూ, బృందారామమూ-వేణుగానమూ, రాసక్రీడ, గోపిక గోపికకూ నడుమ కృష్ణుడు, కృష్ణునకూ కృష్ణునకూ నడుమ గోపిక - ఇదంతా మానవాత్మ పరమాత్మల సంయోగ మని పెద్దలు తల లూపుతారు. ఎందరకో ఈ గోపికా కృష్ణుల మధుర సంబంధం హాయి కలిగిస్తుంది.

తరువాత తరువాత ఇలాగే ఎందరెందరో కృష్ణులు వస్తారు.

"తొడలు తలాడగా నిడి రుక్మిణి భజింప, పదము లొత్తుచు సత్యభామ నిలువ" మిత్రవింద చామరము వీవగా, జాంబవతి తాంబూల మీయగా, అష్ట మహిషులతో, పదునారు వేల వ్రజవిలాసవతులతో "క్రొమ్మెరుంగులతోడి కార్మొగులు" లాగ, సింగారపు సభలో కొలువున్న "షోడశ సహస్ర కామినీ స్తోమ ధేను కారిరంసా మదోత్కట వారణేంద్రము"-

సురలకూ దొరలకూ మౌనివరులకూ మరులు గొలిపే త్రిలోక మోహనుడయ్యు అలవోకగా ఆలి అడుగుల కడ ఒరిగిన రసిక శేఖరమూర్తి-

అరదముపై తాను హాయిగా ఒరిగి చిరునవ్వుతో, చెక్కుచెదరక,

పక్కనున్న భార్య చేత ప్రబల శాత్రవునితో భయంకర యుద్ధం చేయించిన వీరశృంగారమూర్తి-

కురువృద్ధులూ, గురువృద్ధులూ, శతసహస్ర రాజన్య వీరసింహాలూ, దివ్యర్షులూ ఉన్న లోక సదస్సులో, తానెవరి వైపూ చూడక, అందరూ తనవైపు చూడగా, ఆగతానా గతాలు తెలిసినవా డయ్యూ ఒక రాయబారియై, హఠాత్తుగా అకాలగర్జలు వినిపించి, మెరుపులు మెరిపించి, కళ్లులేని వానికి విశ్వరూప సందర్శనము కటాక్షించిన దుర్నిరీక్ష్య దివ్యమూర్తి.

రణరంగములో సడలిన చేతికి జవముకోసము, జారిన వింటినారికి బిగువుకోసము, చెదరిన హృదయానికి స్థైర్యం కోసము, 'ప్రాభాతనీరజబంధు ప్రభమైన చేలము" కిందికి జారగా, వదన నీరజముపై నీలాలకలు తూలగా, లీలగా, రథముపై నుండి నేలకు దూకు రుద్రమోహనమూర్తి-

ఏ శ్రీకృష్ణమూర్తి జగన్మోహనం కాదు!

అయితే, నాకు ప్రియతము డైనవాడు రాధాకృష్ణ దేవుడు.

రాధాకృష్ణు లిద్దరకూ వయస్సు లేదు; ఎప్పుడూ తరుణ శృంగారమూర్తులే.

"చదలు పయోదమాలికల శ్యామల మయ్యె; తమాలపంక్తులన్
కొదమవనమ్ము చీకటులకున్ నెల వయ్యె; కుమారభీరు డీ
యదుసుతు డిల్లు చేర్పు మని యాడెడు నందనిదేశ మాలకిం
చి దెసలు చూచుచున్ జనియె స్నేహతపస్విని రాధయొంటిమై

చెదరి విరిసిన అబెయ్యకదుపు లెల్ల
మందగొనగ ఆకర్షించు సుందరాను
రాగరాగగీతికలైన రావు కృష్ణ !
ఎంత చెవి యొగ్గి వినిన నీప్రాంతమందు.

కడలన్ కాల్నడ నేగు త్రోవరులసైగల్ కానగా రావు, చే
పెడు పాలిండ్లరుచుల్ మరుల్గొలుప గోబృందమ్ము పోలేదు, పెం

పుడులేత్తైన కదంబకుంజములదాపుం జేర, వీసంజరా
యిడి వీధీముఖమందు ఎందలసితోయీ ముగ్ధగోపాలకా !

"పచ్చని ఆకుజొంపములపైబడు నందపుసందెవన్నియల్ విచ్చిన నీసిగన్ ప్రతిఫలించిన మించులు నేని తోపవు...." అని వెదకే రాధవీనులకు పిల్లనగ్రోవిపిలుపు దూరాలనుండి వినవస్తుంది.

"దూరము దూరమై తొలుత తోచిన వేణువు మ్రోత అంతలో చేరువ చేరువై" ఎడద చేరుతుంది.

నిశ్శబ్దంలో మురళీ గానంలాగే చీకటిలో తెలియిసుక పుంత పరచుకొంటుంది.

రాధ పరుగెత్తుతుంది.

ఎదురుగా వేణుకుంజం.

అదరిపోతుంది రాధ. పక్కన తమాలం కింద వేదిక – దానిమీద తమంతరాలి పాన్పుగా అమరిన అలరులూ ఆకులూ! ఎలాగ ఎక్కడనుండి ఎప్పుడు వచ్చాడో దానిమీద శ్రీకృష్ణస్వామి తొలుత అతని అడుగులమీద, పిదప ఒడలూ ఒడలూ తాకగా అతని పక్కన, రాధ.

ఏ మయ్యా, "వెన్నెలలవేళనే వేణు వూదేవా, వేణు వూదిన పండువెన్నె లాయేనా !"

"తమది కరిమబ్బు మేని సౌందర్యముకద", నా హృదయంలో తెల్లని వెన్నెలలు ఎలాగ నిండిస్తావో కదా!

నీ పిల్లనగ్రోవిపాట అంత శిశిరశిశిరం కదా, నాలో ఇంతవేదన ఎలాగ రగిలిస్తుంది?

"మరుజన్మ మెత్తెదను మాధవుడనై నేను, చిరునగవుతో కొసరుకురులతో మురళితో," వ్రేపల్లెవాడలో వేగు రాధవు నీ వవుతావు; అప్పుడు నీకు ఒక పట్టాన కనబడక నిన్ను వేధిస్తాను!"

అంటూ కొసరి కొసరి సరసాలాడుతూ చెప్పుతుంటే వినేరాధాకృష్ణమూర్తి గాఢ మోహనరాగంతో నిండి, ఎన్నెన్నో వేళలలో, ఎన్నెన్నో రకాలుగా నాకు తోస్తుంది.

అయినా శ్రీకృష్ణావతారతత్వం అంటే నాకు తెలియదు.

* * *

# గుహుడు

శ్రీ రాముల వారి వంశం రఘువంశం. తండ్రి దశరథుడు తల్లులు కౌసల్య, కైకేయి, సుమిత్ర. భార్య సీతమ్మ. గురువులు వశిష్ఠ విశ్వామిత్రులు. తమ్ములు లక్ష్మణ భరత శత్రుఘ్నులు. బంటు ఆంజనేయులు. భక్తురాలు శబరి. శత్రువు రావణుడు. అశేషజనం ప్రజ. మిత్రుడు గుహుడు.

వీరిలో ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా అతనిని పిలుచుకునేవారు; రామా అనీ, నాథా అనీ, రాఘవా అనీ, సీతానాథా అనీ.

ఈ పిలుపులకు మరికొన్ని మనం కలుపుకొన్నాం. "రామయ్యా, రామయ్యతండ్రీ, రామచంద్రప్రభూ. రామస్వామీ, పట్టాభిరామమూర్తీ" అంటూ మన జీవితాల్లో ఆ ఆతరుణాల్లో వివశులమై కేకలు వేస్తాం. అపరిమితమైన భక్తి ప్రపత్తులతో ఆహ్వానిస్తాం. పిచ్చి ఆప్యాయంతో పిలుచుకుంటుంటాం.

ఆయన ప్రతీ ఇంటా ప్రతీ వ్యక్తిలో ప్రత్యక్ష మవుతుంటాడు. ఊయలలో పరుండి లాలి పాటలు పాడించుకుంటాడు. మళ్లీ తానే

తండ్రియై తన క్షమాదృఢ హస్తంతో మన లేత చేతుల్ని పట్టుకుని నడిపిస్తాడు.

లోకంలో మానవులకు ఎన్ని చుట్టరికాలూ, ఎన్ని బంధాలూ ఉన్నాయో అన్నీ శ్రీరాములతో మనకు ఉన్నాయి. "అతని కేం? అతను దశరథుని వంటి తండ్రి. అంత విధేయు డైన కుమారుడు మరెవ్వరికీ లేడు" అంటాం. అలాగే "అతను ఆంజనేయునివంటి బంటు. లక్ష్మణునివంటి తమ్ముడు. శబరివంటి భక్తుడు" అని అంటూంటే, వారి వెనకాలే శ్రీరాములు ఉంటూనే ఉన్నారు కదూ! ఆయనతో బాంధవ్యం స్ఫురిస్తూనే ఉంది కాదూ!

శ్రీరామచంద్రుని బంధువులలో గుహుడు ముఖ్యుడు. మరి ఈ గుహుడు ఎవరో, స్వామితో ఇతనికి ఎటువంటి చుట్టరికమో మీకు తెలుసునా!

ఇదివరకు ఇంటింటా పెద్దలు రామాయణం పారాయణం చేసేవారు. రచ్చ చావడులలో పురాణం చెప్పేవారు. ఉత్సవపు పందిళ్లలో హరికథలుగా వినిపించేవారు. మధ్యాహ్నం భోజనాలయాక నడవలలోనూ, తులసికోటల పక్కనూ, రాత్రి పక్కల మీదనూ, పడమటింట్లోనూ, అమ్మమ్మా అమ్మా సీతా రాములకథ చెప్పేవారు. ఊకొట్టడానికి కూడా ఊపిరాడనంత ఉత్సాహంతో వినేవారం.

మన ఆదికవి వాల్మీకి. మన ఆదికావ్యం రామాయణం.

నాటి నుంచి కవులందరూ రఘురాముని గాథ కావ్యాలలో అల్లుకుంటూనే ఉన్నారు. స్త్రీలు ఆ ప్రభువు పడ్డ కష్టసుఖాలతో తమ కష్టసుఖాలు కలిపి మనోహర గేయ కావ్యాలు కల్పించుకున్నారు. రామాయణం తోలుబొమ్మలాట ఉంది.

వీటన్నిటిలో ఆదికవి వాల్మీకుల కావ్యంలో లేని సంఘటనలూ గాథలూ రక్తికోసం చొరబడ్డాయి.

అన్నిటిలో కూడా, ఒకసారి సూర్యమండలం లాగ, ఒక సారి చంద్రబింబంలాగ, ఒకసారి అందరానంత శిఖరం మీద. ఒకసారి అమ్మగె అంకం మీద, అవతరిస్తూ, ఒకే ఒక శ్రీ రామ చంద్రమూర్తి సాక్షాత్కరిస్తాడు.

అయోధ్య నేలే దశరథుని కుమారుడై పుట్టడం, తల్లి దండ్రులకీ, గురువులకీ, ప్రజలకీ ఆనందం కలిగేటట్టు పెరగడం, విశ్వామిత్రుడు రావడం, చిరుజానపాలు చిన్నివంకలు తిరిగే నాడే రాక్షసుల్ని సంహరించడం, సీతాదేవిని వివాహమాడడం, పరశురాములకు గర్వభంగం చేయడం, కైకేయి కోరిక కారణంగా తండ్రిమాట నిలబెట్టడానికి అరణ్యవాసానికి బయలుదేరడం- అంతవరకూ కథ జరిగింది.

భార్య సీతమ్మతో, తమ్ముడు లక్ష్మణునితో రథం ఎక్కుతాడు. కూడా సుమంత్రుడు వస్తాడు.

గంగానది అవతలి ఒడ్డున ఉన్న శృంగిబేరపురం దగ్గరకు వస్తుంది రథం. అక్కడ సుమంత్రుడాగిపోయి అయోధ్యకు రథంతో వెళ్ళిపోతాడు.

ఇక్కడి నుంచి నాకు తోచినట్లుగా నా కళ్ళకు ఎలాగ కట్టుతుందో అలాగ గుహుని కథ చెప్తా. ఆదికవి కావ్యంలో నేను చెప్పినదంతా లేకపోవచ్చు.

శృంగిబేరపురం ప్రభువు గుహుడు.

శ్రీ రాములు భార్యతో, తమ్మునితో అరణ్యానికి బయలుదేరినట్టు గుహుడు వింటాడు. వారు శృంగిబేరపురం సమీపించే ముహూర్తం కూడా దగ్గరవుతుంది. గుహుడు అలవికానంత ఆత్రంతో ఊగిపోతుంటాడు.

శ్రీ రామచంద్ర ప్రభువులకు తాను ఆతిథ్యమీయాలాయెను! పాపం, తానెంతవాడు ఆ స్వామికి ఉచిత సత్కారాలు చేయడానికి!

కాని గుహుడికి తెలుసునుకూడా రాములవారి మనస్సు. ఎంత సులభుడాయన! ఎంత మెత్తనిది రామయ్య హృదయం!

అయినా గుహుని మనస్సులో తొందర క్షణక్షణమూ ఎక్కువయి పోతుంది. అయోధ్యనుండి శృంగిబేరానికి వచ్చే పుంత ధూళి రేగకుండా గంగా జలంతో తడిపిస్తాడు. అనుచరుల్ని పిలుస్తాడు. రాళ్లను ఏరించేస్తాడు. మళ్ళీ పిలుస్తాడు. ముళ్ళు ఏరించేస్తాడు. మళ్ళీ మళ్ళీ పిలుస్తాడు. ఒక్కరాయీ ఒక్క ముల్లూ లేకుండా చూడ మంటాడు.

వెర్రితొందర పెడతాడు. వెర్రితొందర పడతాడు. ఎంత దూరాలనుంచి అయినా రామయ్య ప్రభువు అడుగు సడులు పోల్చుకోగలనంటాడు. ఆ అడుగు చప్పుడులు సమీపించిన కొద్దీ పుంత పుంత అంతా వివశయ్యై ఊగిపోతుందంటాడు. గూడలలో అల్లనేరేడు పళ్ళు, దొన్నెలలో క్రొఆల పాలూ, తేనెలూ నింపిస్తాడు.

రామయ్య ప్రభువు ఒక్కడే వస్తుంటే అంత తొందర లేదు. సీతమ్మతల్లి వస్తున్నారు. లక్ష్మణమూర్తి వస్తున్నారు. గుహుడి మనస్సుకు అంత అలజడి అదివరకెన్నడూ కలగలేదు. అనుచరులతో ఊరుదాటి పుంతలో కొంతవరకూ నడుస్తాడు.

ఇంతలో దూరాన సీతారామ లక్ష్మణులు రథం దిగుతారు. వదినగారికి ఆయాసం కలుగుతుందేమో అని లక్ష్మణుడు "అదుగో నమ్మా, అదే శృంగిబేరం, మనమిత్రుడు గుహుని గ్రామం. అదుగో, ఆ చెట్ల తోపులలో నుంచి కనపడుతుందే, అదే" అంటాడు. "ఆకు పచ్చని ముసుగులో నుంచి లజ్జావతిలాగ కనపడుతుంది దవ్వుల నుంచి ఆ గ్రామం" అంటారు శ్రీ రాములు. "మాచెల్లెలు ఊర్మిళా దేవిలాగ అని అంటారేమో" సీతాదేవి చిరునవ్వుతో లక్ష్మణదేవర విననట్లు "అడుగడుగో గుహుడే అనుకుంటాను. పరివారంతో ఎదురు చూస్తున్నాడు" అంటాడు.

అంతలో గుహుడు వారిని చూస్తాడు. రివ్వున పరుగెత్తి వచ్చి, శ్రీ రాముల పాదాల మీద వాలబోతాడు. రామచంద్రమూర్తి గుహుణ్ణి ఎత్తి కౌగిటిలోనే గుచ్చుకుంటారు. సీతాలక్ష్మణుల కళ్లు చెమ్మగిల్లుతాయి.

పాపం, అరణ్యవాసానికి కొత్తగా బయలుదేరిన వారికి ఈ గుహుడు ఆ సమయాన ఎంత ఆప్తుడుగా పాతచుట్టంగా కనపడతాడో.

"రామా, దయచేశారా! సీతమ్మ తల్లీ! మీరూ వచ్చారమ్మా? దయచేశారయ్యా, లక్ష్మణస్వామీ!

వచ్చినారా రామలక్ష్మణులు మీరు
వచ్చినారా మీరు జానకీ దేవి
వచ్చి నా పట్టణం ఏలుకో రాదయ్య!

రామయ్యా! ఇంక మీరు ఇక్కడ నుంచి వెళ్లవద్దు. పధ్నాలుగు వేల నా పరివారంతో ఈ పట్టణం ఏలుకోండయ్యా. నేను కొలుచుకుంటూ ఉంటాను. నా మాట తోసెయ్య కండి" అంటూ గుహుడు బతిమాలుకుంటాడు.

"పట్టణమున పాదములు పెట్టి మోపముగా" అంటూ శ్రీ రాములు "అయ్యా, గుహా, నీవు నామిత్రుడవు, పెద్దవు. తండ్రిగారి మాట పాలించవద్దా ? నా తల్లి కైకమ్మ ఆజ్ఞ తోసెయ్యనా?" అంటాడు.

గుహుడు మారుమాట చెప్పలేదు. ఆ రాత్రి అక్కడ వేంచేసి ఉండమంటాడు.

'అల్లనేరెడు పళ్ళు ఆవుల్లపాలూ గూడల్లో పెట్టుకున్న' గుహుడు ఆరాత్రి శృంగిబేరంలో సీతారామలక్ష్మణులకు ఆతిధ్య మిచ్చి ఈనాటికీ మన ఆదరానికీ, పూజకీ పాత్రుడయ్యాడు.

మరునాడు ఉదయం గుహుణ్ణి విడనాడి బయలుదేరి పోవాలి.

నిన్న సాయంకాలం అన్యోన్యసందర్శనం ఎంత ఆనందం కలిగించి ఉంటుందో ఈ ఉదయం వియోగం అంత దుస్సహమై బాధించి ఉంటుంది, ఆ నలుగురి మనస్సులనూ.

కాని ఆ ఉదయం సీతారామలక్ష్మణుల్ని శృంగిబేరం నుంచి పంపివేయడం నా కిష్టంలేదు.

సంధ్యాసమయం దాటిన తరువాత, మునిమాపు ముసరకముందు, వారిని గుహుడు గంగానదిని దాటించినట్లు నా కళ్ళకు కనబడుతుంది.

సీతారామలక్ష్మణులతో గుహుడు గంగా తీరానికి వచ్చాడు. గాలిదేవుడు కూడా దిగులువల్ల ఊపిరి బిగబట్టాడు. గంగానది కంఠం బిగిసిపోయి ఉంటుంది. మామూలుగా ఒళ్ళు విరుచుకుని ఒత్తిగిల్లి కాస్త గలగల మనడం కూడా ఆ సమయంలో లేదు.

వియోగ సమయంలో, గుండెలు బాగా బరువై పోయినప్పుడు ఎందుకో మనం వెర్రి నవ్వులాటలూ చమత్కారపు మాటలూ అనబోతాం. ఆ మాటలలో మరీ పోటుతనం ఉంటుంది.

గుహుడు అంటాడూ, "రామయ్య తండ్రీ, ఒఖసారి మీ పాదాల్ని కడిగితేనే కాని నా పడవలో అడుగు పెట్టనియ్యను. ఏమో స్వామీ, మొన్ననేకదా మీ పాదరజం తగిలి రాయి స్త్రీ అయిపోయింది. ఇప్పుడు నా పడవకు కూడా ఆగతే పడితే నే నేమవను, చెప్పండి" అంటాడు. పాపం, అసలు గుహుని మనస్సులో ఉన్న అభిప్రాయం వేరు. శ్రీ రామస్వామి పాదాలు ముట్టుకోవాలి. వాటిని కడగాలి. ఆ కోరికనే తెలియపరిస్తే ఆ వినయమూర్తి అంగీకరించకపోవచ్చు'.

గుహుడు శ్రీ రాముని పాదాలను గంగాజలంతో కడుగుతాడు. ఆ మాటలంటూంటే, ఆ అడుగుల్ని కడుగుతుంటే కపోలాలు తడిసిపోతుంటే, తడిసిన కళ్ళు కనపడకుండా ఉండడానికి అమ్మవారు తలవంచుకుంటారు. లక్ష్మణస్వామి తల తిప్పుకుంటాడు.

గుహుడు శ్రీ రాముని పాదాలను కడుగుతాడు. వణికే చేతులతో ఎంత గారాంగా స్పృశించాడో ఆ అడుగుల్ని, ముద్దుగా, మృదువుగా లాలిస్తూ, నిమురుతూ, ఒక పట్టున తెమలకుండా.

గుహుడు శ్రీ రాముని పాదాలను కడుగుతాడు. అంతకుముందు జనకరాజర్షి సీతమ్మ తల్లిని అల్లుడికి ఇచ్చేటప్పుడు ఆపాదాలను

కడిగాడు. ఆ తరవాత నేటివరకూ కోట్ల హృదయాలు కరిగి పొంగిన అశ్రువులు ఆ పాదాలను కడుగుతున్నాయి.

స్వామికాలు తడియ నక్కర లేని రేవుదగ్గర పడవ నిలబెట్టి ఉంచుతాడు, గుహుడు. ఆ పడవలో మెత్తగా ఆకులూ పువ్వులూ ఆసనాలూ; పరుస్తాడు.

ముందు తాను చుక్కాని దగ్గర. తన దగ్గర శ్రీ రామ చంద్రమూర్తి. వెనక సీతామహాదేవి. ఆ వెనకాల లక్ష్మణస్వామి.

పడవ కదులుతుంది కదలలేక కదలలేక. ఆ సాయంకాలం ఆ పడవ గుహుని హృదయం అంతబరువుగా ఉందాయెను.

సుడులూ, వడులూ లేని నీటి దారులలో నావ నడిపిస్తాడు గుహుడు. శ్రీ రాముల్ని గంగ దాటిస్తుంటాడు.

"అమ్మా! సీతమ్మతల్లీ! మీకు ఇబ్బందిగా లేదుగదా! లక్ష్మణస్వామీ మీకు సదుపాయంగా ఉందా అయ్యా!" అంటూ, మధ్య మధ్య ఏవో బేలమాటలు అంటూ, గుహుడు, పడవనడిపిస్తాడు. వారెవ్వరూ మాటాడలేదు.

నావ అవతలి ఒడ్డుకు తగులుతుంది.

దూరాన చిత్రకూటప్రాంతాన ఉన్న అరణ్యాలలోని చీకట్లు ధైర్యంగా ఇవతలకి వచ్చి పడిపోతుంటాయి.

సీతారామలక్ష్మణులు నావ దిగుతారు. శ్రీ రాములు గుహుణ్ణి పడవనుంచి దిగనీయరు.

"తండ్రీ, పద్నాలుగేడులపై ఒక్క గడియ ఆలస్యమైతే నే బ్రతకను సుమా!" అంటాడు గుహుడు. ఆ మాటలు అతని గద్గదగళంలో తునియలుగానూ, ఊరుపులుగానూ, తరువాత ఏడుపులు గానూ, విరిగిపోతాయి. రామయ్య తండ్రి చిరునవ్వుతో, "అలాగే వస్తాను" అంటారు.

ముగ్గురూ చిత్రకూటంవైపు కదులుతారు.

దూరాన చిత్రకూటం సందెచీకట్లో పెద్ద ఏనుగులాగ, ఒరిగిపోయిన నల్లమేఘంలాగ, కనిపిస్తుంది.

గుహుడు పడవ మళ్ళించి పోలేదు. అటే చూస్తుంటాడు. సీతారామలక్ష్మణులు నడిచి నడిచి చిత్రకూటపు సానువుల వద్దకు వెడతారు. చీకట్లలో చిల్లులు పడేటట్లు గుహుడు చూస్తాడు. ఆ చీకట్లలో మెరుపుల్లాగ సీతమ్మా లక్ష్మణమూర్తీ కనపడతారు. అక్కడే శ్రీరాములు కూడా ఉంటారని అలాగే చూస్తుంటాడు.

"మసక మసకసందె, ఉసు రుసు రనుగాలి,
గంగ జాలిమ్రోత, బెంగవలన
డిల్లవడినపడవ, అల్లన నిలుచుండు
నా గుహుండు పదియు నాలుగేండ్లు"

అనిపిస్తుంది నాకు.

"కోట్లను తరింపజేసిన వాణ్ణి గుహుడు తరింప జేస్తాడు. లోకాని కంతకూ శ్రీరాముడు కర్ణధారి అయితే, గుహుడు శ్రీరాములకు కర్ణధారి ఓహోహో!"

అని అంటుంది నాటి నుంచీ ఈ భారత జగత్తు.

ఇంక కథ. తరువాత శ్రీరాముల అరణ్యవాసం సీతాపహరణం. శబరిగాథ, కిష్కింధ, సేతుబంధనం రావణవధ, సీతారామ లక్ష్మణులు తిరిగి రావడం, పదునాలుగేళ్ళు ముగియడం అంతా జరుగుతుంది.

తిరిగివస్తూ, రాములవారు భరద్వాజాశ్రమం దగ్గరికి వస్తారు. నాటికి పధ్నాలుగు సంవత్సరాలూ ముగిసిపోతాయి. భరద్వాజ మహర్షి రామచంద్రుణ్ణి నాటికి ఆశ్రమంలో ఉండి, తమ విందు స్వీకరించమని ఆజ్ఞాపిస్తారు. రామచంద్రులు ఆ ఆజ్ఞ స్వీకరిస్తారు.

కాని "పదునాలుగేళ్లపై ఒక్క గడియ ఆలస్యమయితే బ్రతకను

సుమా" అన్నాడు గుహుడు. అలాగే తల్లులూ, భరతుడూ అన్నారు. శ్రీ రాముల మనస్సు తొందరపడుతుంది.

"రావయ్య హనుమయ్య, పోవయ్య వెగ !
అపకీర్తి రాకుండ అయోధ్యపురికి.
కౌసల్యతో చెప్పు కడు వేగ బోయి
కైకమ్మతో చెప్పు కడు వేగ బోయి
సుమిత్రతో చెప్పు శుభము నీ కౌను
భరతునితో చెప్పు గుహునితో చెప్పు
మనరాక మనవీటి ప్రజల కందరికి
చెప్పి రా హనుమయ్య చెప్పి రావయ్య
పదునాలుగేండ్లకు పైన ఒక గడియ
నిలిచినా ప్రాణాలు నిలువవోతండ్రి!
అన్నారు. పరుగెత్త వయ్యా, హనుమయ్యా"-అంటారు.

ప్రాణాలు నిలబెట్టడానికే అవతరించిన ఆంజనేయమూర్తి, ఇదివరకు సీతాదేవి ప్రాణం, లక్ష్మణదేవర ప్రాణం నిలిపిన భిషక్చక్రవర్తి, రివ్వున ఆకాశంలోనికి ఎగురుతాడు. శృంగిబేరపురం సమీపిస్తాడు.

దూరానమంటలూ, పొగలూ కనబడతాయి. గుహుడు చందన కాష్ఠాలతో చితి పేర్చుకున్నాడు. "రామా" అని పిలుస్తూ చితి ఎక్కబోతుంటాడు. "ఆగవయ్యా, గుహా! రామచంద్ర ప్రభువులు విజయం చేస్తున్నారు" అని హనుమయ్య కేక వేస్తాడు. గుహుడు పరవశుడై మూర్ఛపోయి నేలమీది కొరుగుతాడు.

తరువాత భరద్వాజాశ్రమం నుంచి శ్రీరాములూ వస్తారు. గుహునితో కలిసి నందిగ్రామం వెడతారు. అక్కడ జటావల్కలాలు విసర్జిస్తారు. అయోధ్యకు విజయం చేస్తారు. పట్టాభిషేకం జరుగుతుంది.

ఆ సమయంలో అందరూ సభలో ఉంటారు. ఒక్క దశరథుడు తప్ప. ఒకరు చామరం, ఒకరు ఛత్రం పట్టుకుంటారు. ఒకరు

పాదాలవద్ద ఒకరు ద్వారం వద్ద, నిలబడతారు. సుగ్రీవ జాంబవంతాదులు సభ్యులలో ఉంటారు.

గుహుడొక్కడూ మిత్రస్థానంలో ఆసీనుడై ఉంటాడు.

చత్రగ్రాహిక దూర్మిళారమణ, చంచచ్చామరగ్రాహిక
చ్ఛత్రుధ్వంసక కైకయీతనుభవాత, ద్వాస్సావిదర్వ్యాత్రజి
త్పాత్రా, సభ్యదగాటభల్లుకమణీ, పౌరాణికత్వావనీ,
మిత్రద్రాశకులేశ, రాజ్యపదలక్ష్మీ ధూర్వహత్వాదుకా.

అని పట్టాభిరామమూర్తిని కవులు వర్ణించారు.

సుగ్రీవునికి కూడా లేని పదవి గుహునికిచ్చారు. వాలి కథ అయ్యాక సుగ్రీవుడు విషయలోలుడై రామకార్యం మరచినప్పుడు "వాలిని చంపిన బాణం పదునుపోలేదు" అని లక్ష్మణుని ద్వారా సుగ్రీవునికి రాములు వార్త పంపుతారు. గుహుని కొరకే మిత్రపదవి కటాక్షించారు ప్రభువు. ఇది కావ్యాలనుంచీ గేయాలనుంచీ నేను కట్టుకున్న గుహుని కథ.

* * *

# మలుపు తిరిగితే

"ఏమండీ ! ఈ రోడ్డు ఎక్కడికి పోతుంది" అని ఒక డడిగాడట. "నేను ముప్ఫయ్యేళ్ళనుంచీ చూస్తున్నాను; ఎక్కడికీ వెళ్లడం లేదు; ఇక్కడే ఉంది ఈ రోడ్డు" అని మహా తెలివైన వాడిలాగ రెండోవాడు జవాబు చెప్పాడట!

ఇది చురుకైన మాటలాగ కనబడుతుంది; కాని కాదు. దీనిలో నిజం లేదు. ఇది సూక్ష్మదర్శి అనే మాట కాదు.

రోడ్డెక్కడికీ వెళ్లకపోవడం వేమిటి? అది హమేషా ఎక్కడికో ఒకక్కడికి వెడుతూనే ఉంటుంది.

ఒక్క చిటిక నిలబడకుండా రోడ్డు నడుస్తుంది; రకరకాలుగా నడుస్తుంది.

రోడ్డు పరుగెత్తుతుంది కూడా. ఎటొచ్చీ, ఎప్పుడూ విరామం లేకుండా కదులుతూ ఉండడం వల్ల, చలనం లేకుండా, ఉన్నట్లుంటుంది-రివ్వున గిర్రు గిర్రున తిరిగే బొంగరం కదలకుండా ఉన్నట్లు కనపడుతుందే, అలాగ! వెనకటికి ఒక ఏరు

"నడకరాని దారి కాను
జడమగు రహదారి కాను"

అని దారిని హేళనచేస్తూ పాడిందని ఒక కవి వ్రాసేడు అందరికీ తెలియదు నిజం.

తన ఒడ్డు మీదనే నిదానంగా ఉన్నట్టుండే కాలిదారినీ, ఆ దారి కావల నిశ్చల గంభీరంగా కనపడే రహదారినీ, చూసి, ఆ ఏరు ఆ మాట అని ఉంటుంది.

అయితే, ఏటికన్న బాటే గొప్పది పెక్కువిధాల. కాలువకు, ఏటికి కడలి కడపల– అంటే గమ్యస్థానం. కనుక అది అటువైపే నడవగలదు. మార్గము ఇటూ అటూ నడుస్తుంది – ముందుకీ వెనక్కీ రెండుతలల పాములాగ.

దారి వెయ్యికాళ్ల జెర్రివంటిది. పాపం, దానికి రవంతయినా విశ్రాంతి లేదు.

## 2

నా చిన్నతనంలో మాత్రం మార్గం స్తిమితంగా నడిచేది. అప్పుడది వేగం ఎరగదు. ఎప్పుడోగాని పరుగెత్తేది కాదు.

సైకిళ్లూ కార్లూ ఉంటేనేగాని రోడ్డు పరుగెత్తలేదు.

అప్పటి ప్రయాణాలు బాగుండేవి– కాలినడక నైతే నేమి, ఎడ్లబళ్లమీద నైతేనేమి ! ప్రయాణమంతా ప్రియమైన అనుభవం లాగ ఉండేది; కష్టసుఖాల మాలగ్రుచ్చుకున్నట్లు ఉండేది ప్రయాణం. "హుఫ్" అని ఇక్కడ నుంచి అక్కడ వాలడం కాదు ఈ రోజులలో లాగ.

దారీ బాటసారీ అప్పుడు దగ్గర నేస్తాలు. బాటసారి పదధ్వనులను ఎంత దవ్వులనుండి అయినా పసిగట్టగలిగేది దారి; ఇద్దరూ కలిసికట్టుగా నడుస్తూ పోయేవారు. దారి తెమిలేదికాదు; బాటసారికి బోలెడు తీరిక ఉండేది.

బాటసారులలాగే దారులు రకరకాలు.

చేలల్లో గట్లదారులూ, తోపుల్లో పుంతదారులూ, కొండ కనుమల్లో కునికేదారులూ, కాశీ రామేశ్వరాలకు రహదారులూ – ఇలాగ ఎన్నో ఉన్నాయి.

గాలిదారులూ నీటిదారులూ కవులకు మాత్రమే అప్పుడు ఎక్కువగా ఉండేవి. ఇప్పుడందరికీ ఉన్నాయి.

## 3

అయితే అన్ని దారులూ బాగుండవు. కొన్ని తిన్నగా నున్నగా సూటిగా పేలవంగా ఉంటాయి: వీటిమీద చేసే ప్రయాణానికి ఊపూ ఉల్లాసమూ ఉండవు. మలుపుల్లేని బాటలవి.

మలుపులేని బాట మన్ను, మరణం. ఛీ! మలుపుల్లేని మార్గం బాగుండదు.

మలుపు పిలుపువంటిది; "వెనకాల ఎవరున్నారు చెప్మా! ఏముంది చెప్మా" అనిపించి అడుగులను హెచ్చరిస్తుంది. మలుపు తెరచుకొన్న తలుపువంటిది; తెరవగానే మనకోసం ఎవరున్నారో!

మార్గం రాగమైతే మలుపులు సంగతులు.
మార్గం పామైతే మలుపులు మెలికలు.
మార్గం తీగెతే మలుపులు వంపులు.
మలుపులతో దారి భంగిమలతో ఒయారి.
"That Lure of the turn of the road,
of the crest of the hill"

అన్నాడు కవి.

మార్గానికి మలుపులేగాక ఎగుడు దిగుడులు కూడా ఉండాలి అంటాను. ఉండకపోతే ఎలాగ? వైకుంఠపాళీ ఆట ఉంది– పరమపద

సోపాన పటంమీద ఆడేది. ఇది జీవితమంత ఆకర్షవంతంగా ఉంటుంది నాటకంలాగ. ఎందుచేత? దీనినిండా మలుపులూ ఎగుడు దిగుడులూను! ఎప్పుడేది జరుగుతుందో, ఏది మనకు మరునిముషం సిద్ధంగా ఉందో మనకు తెలియదు. ఎన్నో హఠాత్సంఘటనలు ! ముందువచ్చేది నిచ్చెనో విషసర్పమో మనకు తెలియదు.

వరుసగా నిచ్చెనలే వచ్చేసి, పరమపదం ఇట్టే ఎక్కేసి కూర్చుంటే ఆట బాగుండదు.

పరమపదం దాకా పరచుకున్న పథంలో, ఒక మలుపు తిరిగితే ప్రసవం, మరొకటి తిరిగితే పన్నగం, ఆ పాముకాటువల్ల నేలపై ఒరగడం, అంతలో తేరుకుని ఒక నిచ్చెన ఎక్కడం, ఒక తేనె కలువ దాటడం, ఇక నొక్క చిన్న నిచ్చెన ఎక్కడం, ఒక సౌందర్య సీమ ఎదురవడం, మరొక సోపానం దాటడం, పూలతోటలో కాలుపెట్టడం, ఆనంద ధామపు అంచులూ గోపుర శిఖరాలూ కనబడడం, ఇంతలో ఒక కాలాహి కరవడం, మళ్ళీ సొమ్మసిల్లి నేలదాలడం ఇదీ, మలుపులతో, ఎగుడు దిగుడులతో, వైకుంఠపాళీ.

వైకుంఠపాళీ అంటే మానవుని మహా ప్రస్థానం– అనుకోకుండా ఆనంద నిశ్రేణీ, అగపడని అంధకూపమున్నూ. అయినా, వీటి అన్నిటివల్లనే, జీవితానికి గమనం, ఊపు, చైతన్యం, ఉత్సాహం, లక్ష్యం వస్తాయి.

మలుపులూ ఎగుడుదిగుడులూ జీవిత మార్గంలో ఉండి తీరాలి.

## 4

తిరుమలపై వేంచేసి ఉన్న వేంకటేశ్వర ప్రభువుల శ్రీ చరణ సన్నిధానానికి, కోటి మెట్లపై, కోటిమలుపులు తిరిగిన రాలదారినిబడి, యాత్రికులు పూర్వం కాలినడకను ఏడుకొండలూ ఎక్కేవారు. రాళ్ళూ, ముళ్ళూ, పాములూ, పులులూ, అందని అధిత్యకలూ, అగాధపు లోయలూ -

అన్నీ కడచిపోతేనేగాని కన్నుల పండు వయ్యేదికాదు. దివ్యసన్నిధిని నిలవడానికి యాత్రికులు అంత శ్రమపడి తీరాలి – "Thou must pass through fire and water before thou reachest a wealthy place".

అయితే, ఆ శ్రమ ఆనందంతో పులకితమైనది. నడుమ నడుమ కొండ కొమ్ము చేరగలనో లేదో అన్న సందేహం, ఒక్కొక్కప్పుడు చదికిలబడి నిట్టూర్చే బలహీనత, తరుణులైన ఆలుమగలు ఒకరివైపు ఒకరు చూసుకొని ముందుకు దూసుకుపోయే ఉత్సాహం, వృద్ధులు ఒక్కసారి జరిగిపోయిన ప్రయాస నెమరు వేసుకొని వెనక్కి తిరిగిపోలేక ముందు మలుపు చూసి మరికొంత ముందుకు నడిచే పట్టుదలా, ఒక మలుపులో వృక్షచ్ఛాయ, ఒక మలుపులో విశ్రాంత వేది మలుపు మలుపునా కానాకోనా కనుమా, మలుపు మలుపునా అందుతున్నట్లు కనబడే ఆలయవిమానం–ఇవన్నీ ఉంటేనేగాని దివ్యయాత్ర కానేకాదు. జీవిత యాత్రాకాదు.

## 5

ఒక్కొక్కని జీవితం, వడిదుడుకులు లేక, మలుపులు లేక, కదలించే సంఘటనలు లేక, ఎంత సుఖంగా నయినా ఉన్నట్లు ఉంటుంది. వానికి ఒక రోజు మరొక రోజుకు ప్రతిధ్వని; నిముషం పక్క నిముషం ఇటుక పక్క ఇటుక పేర్చినట్లు ఉంటుంది వానికి. కాని మార్గంలో మలుపు మలుపునా ఒరగా ఒరిగి విరితీగలు ఓవరులూ పందిరులూ నేయవు. చిదికి పోయిన పదాల నెత్తురు గురుతులు కనబడవు వాని దారిపై; దానికి ఇరుదెసలా పగిలిన హృదయ శకలాలు పడి ఉండవు. వాని జీవికలో ఆరు రుతువులూ అంటూ ఉండవు; నవరసాలూ ఎదురుకావు. వాడు నిదాఘంతో నిట్టూర్చడు; శ్రావణంతో రోదించడు. వాని జీవిత పథంలో అడ్డుగా దాటవలసిన వాగులుండవు; వేసంగులు వచ్చి ఆ యేళ్లు ఎండిపోవడమూ వానకారులు వచ్చి వాటి ఒళ్లు నిండుకోవడమూ

ఉండవు. వాని బ్రతుకు త్రోవల కెదురుగా భాను కిరణాల భర్మ కిరీటాలతో దూర పర్వత శృంగాలు సాక్షాత్కరించవు; వాటిపై చరమ సంధ్య సిందూరం ఆరబోసుకోదు. వాటికి ఇటూ ఇటూ లోయలలోనుంచి నీడలు మూల్గవు.

వాడు హాయిగా ఉన్నాడనిపిస్తుంది. కాని వాని జీవితమార్గం కదలడం లేదన్నమాట. వాని దారికి కాళ్లు లేవు. వాని మార్గానికి మలుపు లేదు; దూరాన్నుంచి వినబడే పిలుపూ లేదు.

## 6

"అతగాడు స్థిరపడలేదు ఇంకా" అని విచారిస్తాడు – స్థిరపడడం మంచిది లాగ –"అతగాడు కదలడం లేదు, నడవడం లేదు" అని సంతోషించినట్లు. నాకు స్థిరపడడం ఇష్టంలేదు. ఎల్లవేళలా తిరగాలని ఉంటుంది; పవలూ రాత్రీ పయనించాలని ఉంటుంది; మలుపులూ ఎగుడు దిగుడులూ ఉన్న తెరువుల పైబడి నడిచిపోవాలని ఉంటుంది.

*"I hang about the streets all day*
*At night I hang about"*

అన్నట్లు.

అలాగ నడుస్తూ, మార్గాన ఎదురైన ప్రతి వ్యక్తివైపు చూసి, చిరునవ్వి, కళ్ళతో పలకరించాలని ఉంటుంది. ఒక్కసారి దారిని తారసిల్లిన ప్రతివ్యక్తి చేయీ పట్టుకొని కాస్త ఆప్యాయంగా నొక్కాలని ఉంటుంది.

*" Perhaps to know that still I go*
*Alive about a living land. "*

అలాగ నడిచి నడిచి, రాతిరి మూసేక త్రోవ పక్కన ఎక్కడో ఒకపాద చెంత వెన్నువాలిచి, దానిలో నుంచి నక్షత్రాలను చూస్తూ పడుకోవాలని ఉంటుంది. దూరాన నుంచి ఎప్పుడూ వినబడుతున్నట్టుంటుంది,

నిలవనీయని ఒక కేక ఏదో ! దారికి పాట ఇష్టం. నా దారికి మరిన్నీ, మలుపులున్న దారికి మరీ మరీ. నాకు నడక నాటుబండి ప్రయాణం, ఇష్టం. అవి పాట లేనిదే సాగవు.

## 7

ఇక–

జీవిత మార్గంలో గొప్ప మలుపులున్న మానవుని జీవితం మహాకావ్యం అవుతుంది. రామాయణం లాగ, మహాభారతంలాగ; ఆ మానవుని మహాత్ముడంటారు. జీవిత మార్గంలో మలుపుతిరిగితే, ఆపద వచ్చినా ఆనందం కలిగినా, తరువాత స్తిమితంగా వాటిని నెమరు వేసుకొన్నప్పుడు మాత్రం అన్నీ అమూల్యంగానే కనబడతాయి; ఆప్తంగా ఉంటాయి. వాటిని మాసిపోనియ్యం. అవి తీయనివై పోతాయి. అనంతయాత్రా మార్గం మీద అవి మనకు దారి బత్తెం.

కాశీమజిలీలలో ఒక కథ ఉంది.

అనగా అనగా ఒక యువకుడున్నాడు. వానికి తల్లీ తండ్రీ ఎవ్వరూ లేరు. మాధుకరం చేసుకునేవాడు; వడిదుడుకులు లేక వాని బ్రతుకు సుఖంగా సాగేది. బ్రతుకుతున్నానని వానికి తెలియదు. వానికి రాత్రీ పగలూ తేడాలేదు. అంతలో వానికి తెలియకుండానే బ్రతుకు తెరువు ఒక మలుపు తిరుగుతుంది.

ఒకనాడు ఊరుకోలేక ఉన్న ఊరు వదలి బయలు దేరాడు; ఎక్కడికో తెలియదు. నడిచాడు, నడిచాడు. మునిమాపు వేళకు ఒక పట్టణ పరిసరానికి వచ్చాడు. అక్కడ ఆగాడు. పాతబడిన మానవునికన్న పలుకరించే తోట నయం అనుకున్నాడు. అలసి ఉన్నాడు కనుక, దరిద్రుడు కనుక, అట్టి శ్రమలు అలవాటయిపోయాయి కనుక, హంసతూలికా తల్పం అక్కరలేకుండానే, నిద్రపోయాడు.

తెల్లవారబోతుంది. వాని నిద్దర అంచులు కదలినట్లయింది. ఏదో కలకలం సోకి ఒళ్ళు విరుచుకున్నాడు. లేచి కూర్చున్నాడు. ఎదురుగా రత్న భూషణాలతో పెద్ద ఏనుగు. ఏనుగుమీద బంగారపు అంబారీ. ఆ ఏనుగు పక్కన వెండి వేత్రాలతో భటులు ఆ ఏనుగు ముందు గంభీరంగానూ వినయంగానూ నిలబడ్డ ఒక పెద్దమనిషి. ఆ ఏనుగు తొండంతో పట్టుకున్న ఒక మందార మాలిక. ఆ ఏనుగుకి దూర దూరాన వేలకొద్దీ జనం. "ఏమిటి ఇదంతా!" అనుకున్నాడు. "ఇంత గొప్ప కలను కరిగించి మాయం చేయగూడ" దనుకొని, మళ్ళీ నిద్ర పోదామనుకుంటుంటే, ఆ ఏనుగు ఆ మాందార దామాన్ని వాని మెడలో వేసి, ఆ తొండంతోనే వాణ్ణి భద్రంగా ఎత్తి, అంబారీలో కూర్చోబెట్టి, పట్టణం వైపు మళ్ళింది. "జయము జయము మహారాజుకి" అని జయ జయ ధ్వానాలు అక్కడి జనం. ఆ పట్టణపు రాజు పురుష సంతానం లేకుండా చనిపోయాడు. పట్టపు ఏనుగు ఎవరి మెడలో దండ వేస్తుందో వాడు రాజు కావాలని మంత్రీ రాజగురువూ అందరూ నిశ్చయించారు. పట్టం కోసం ఆత్రంగా అడ్డుపడిన అందరినీ తప్పించుకొని, ఊరు బయట చెట్టుకింద ధూళిలో కొలువున్న కుచేలుడి దగ్గరకు వచ్చి, ఆ భద్రగజం వాణ్ణి మహారాజుగా ఎన్నుకుంది. తరువాత వాడు రాజు కూతుర్ని, బంగారపు బొమ్మని వివాహం చేసుకుంటాడు కూడా. బ్రతుకు తెరువు ఎంత పెద్ద మలుపు తిరిగిందో!

కాని, మలుపులన్నిటి వెనుక మంగళ సంఘటనలే ఉండనక్కరలేదు.

అంతవరకు ఆనందంగా నడిచింది శ్రీరాముల కథ. బాల్య క్రీడలు, విశ్వామిత్ర క్రతురక్షణ, సీతాకల్యాణం పరశురామ గర్వభంగం, అహల్యాశాప విమోచనం, తర్వాత పట్టాభిషేక మహోత్సవం వరకూ వచ్చింది. ముందు కూడా అలాగే మధుమార్గం పరచుకున్నట్లు ఉంటుంది.

అయితే, దారి హఠాత్తుగా మలుపు తిరిగి ఊరుకుంది. పట్టాభిషేకం బదులు వనవాసం పిడుగులా వచ్చి పడింది. తరువాత, అలాగే, మరో మలుపు వెనక మాయలేడి పొంచి ఉంటుంది.

ఇట్టి మలుపులతో రామాయణం భారతం సాగుతాయి.

గొప్పవాళ్ళ జీవితమార్గం అంతా మలుపులే - సామాన్యుల బ్రతుకుల దారుల్లోనూ మలుపులుంటాయి.

కాని, అందరి జీవితాల్లోనూ మలుపు వెనక ఇట్టి తీవ్ర సంఘటనలు ఉండనక్కరలేదు.

దినదినమూ మన జీవితంలో చిరుమలుపులు వస్తాయి. సంసారంలత కొత్త పూవు తొడగడం, అమూల్యమైన నగ అదృశ్యం కావడం, అక్కరలేని అతిథి రావడం, అనుకోకుండా ఉద్యోగం పోవడం, ఆశించని ధనం రావడం, అనురాగంతో పెంచుకున్న అలరు తీగను ఏ పశువో తుంచివేయడం, అనుకూల పడిన కల్యాణం భంగం కావడం, చిరస్నేహబంధం అకారణంగా తెగి తునిగి పోవడం, ఎన్నడూ ఎరుగని నవీనుడు వచ్చి హృదయంలో ఇల్లు కట్టుకోవడం, ఇవన్నీ మలుపులే మన మార్గంలో మలుపులు తిరగడం తలుపు తీయడం వంటిదే.

తెరవగానే ఆప్తబంధు వెదురు కావచ్చు. అప్పులవాడు నిలబడి ఉండవచ్చు. అయితే ఈ మలుపుల్ని పట్టించుకోని వాళ్ళు ఉన్నారు కొందరు; కొందరు మలుపుల కోసం ఎదురు చూస్తుంటారు.

తీరి కూర్చుని మార్గంలో మలుపులు మలచుకొంటారు కొందరు. కొందరకి ఆదిపర్వం మొదలుకొని స్వర్గారోహణం దాకా మలుపులే. ఏదయినా, మార్గానికి మలుపులు కావాలి, మలుపు వెనకాల మన్మథం ఉండనీ, మధువనం ఉండనీ!

* * *